1956 మే 13 వ తేదీన నర్సుల ఇండ్లకు భారత సాంఘిక సేవా మహాసభ కార్యాలయమునకు శంకుస్థాపన జరిగిన సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తున్నారు.

(క్రింద) శంకుస్థాపన ఉత్సవం తరువాత బేగం సోగ్రా హుమాయూన్ మిర్జా ప్రసంగిస్తున్నారు.



# విషయ సూచిక





ముఖచిత్రం :
సికింద్రాబాదు
మ్యునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయం



వెనుకకవరు :
హైదరాబాదు
మునిసిపల్ కార్పొరేషన్ భవనం
ముందరి దృశ్యం

హైదరాబాదు పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# TOWARDS
# A
# WELFARE STATE



*Progress of the*

## FIRST
## FIVE-YEAR PLAN

*IN*

## HYDERABAD



PRICE: RS. 2-0-0

*Obtainable from :*

**THE DEPARTMENT OF INFORMATION & PUBLIC RELATIONS,**

**H Y D E R A B A D . I (Dn)**

# ఉభయ నగరముల

# మునిసిపల్ కార్పొరేషనులు

హైద్రాబాదు రాష్ట్ర ప్రజలు స్వాతంత్ర్యం పొందిన తరువాత రాష్ట్రానికి చేకూరిన సత్ఫలితాలలో హైద్రాబాదు, సికింద్రాబాదు మునిసిపాలిటీల ఎన్నికలు జరిపించి, వాటిని పూర్తిగా ప్రజాస్వామిక సంస్థలుగా చేయడం ముఖ్యంగా చెప్పుకోదగిన విషయం. ఈ ఉభయనగరముల కార్పొరేషనులకు 1951 లో వయోజనవోటింగు ప్రాతిపదికపై ఎన్నికలుజరుపబడినవి. అప్పటినుంచి గతఐదు సంవత్సరాలలో ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు పౌరులకు హెచ్చుగా సౌకర్యములు కల్పించడానికీ, రెండు నగరాలు కడు ఆధునికంగా కన్పించడానికీ చాలా కృషిచేశారు.

మళ్ళీ 1956 జూన్ 26 తేదీన ఉభయ నగరముల కార్పొరేషనులకు ఎన్నికలు జరుగుతున్నవి. కనుక ప్రథమ పర్యాయంగా ఎన్నికైన కార్పొరేషనులు చేసిన పని ఈ దిగువ సంక్షిప్తంగా తెలుపబడింది:

హైద్రాబాదు కార్పొరేషన్ గత ఐదేండ్లనుంచి ప్రజా ప్రతినిధుల పరిపాలన క్రిందవున్న కారణంచేత జరిగిన ముఖ్యమైన అభివృద్ధి ఏమంటే కార్పొరేషను ఆదాయం చాలా హెచ్చింది. 1951-52 లో ఆదాయం రూ. 41.76 లక్షలు అయితే 1955-56 లో దాదాపు రూ. 70 లక్షలకు పెరిగింది. కొత్తపన్నులు వేయకుండానే, రేట్లచార్జీలు పెంచకుండానే ఈ పెరుగుదల సాధ్యమయింది. 1956-57 లో రూ. 79 లక్షల ఆదాయం రాగలదని అంచెనావేయబడింది. ఆక్ట్రాయి పన్ను వేయబడనుండడమే ఈ పెరుగుదలకు కారణం. 1955 సంవత్సరపు చట్టము ననుసరించి ఆక్ట్రాయి పన్ను విధింపు అమలులోకి వస్తున్నది.

కార్పొరేషను పరిపాలనావ్యవస్థలో ఏర్పడిపోయిన మాంద్యమును తొలగించడం వల్లనే ఈవిధంగా ఆర్థిక పరిస్థితి అభివృద్ధి చెందినది. కార్పొరేషన్ సభ్యత్వం ప్రజాస్వామికం కావడంచేత ఉద్యోగులలో కూడా సేవాభావం అలవడింది. ఆదాయం పెరిగినట్లే ఖర్చు కూడా పెరిగింది. 1951-52 లో ఖర్చు రూ. 45.21 లక్షలయితే 1955-56 లో రూ. 70.74 లక్షలకు పెరిగింది. 1956-57 లో రూ. 78.52 లక్షలు ఖర్చు కాగలదని అంచెనావేయబడు తున్నది.

ఈవిధంగా ఆదాయాన్ని పెంచడంవల్ల పౌరులకు హెచ్చు సౌకర్యములు కల్పించడానికి వీలు కలిగింది. ప్రస్తుత కార్పొరేషన్ ఏర్పాటుచేయబడుటకు ఐదేండ్లకు పూర్వం అంటే 1941 నుంచి 1951 వరకు ప్రజా సౌకర్యములకొరకై హాలీ రూ. 10,67,955 లు మాత్రమే ఖర్చుపెట్టబడినవి. కాని 1951 నుంచి 1956 వరకు అంటే అయిదేండ్లకాలంలోనే పౌరులకు సౌకర్యములు కల్పించడానికి కల్దారు రూ. 50 లక్షలు ఖర్చుపెట్టబడినవి. పైగా ప్రజా సంక్షేమ కార్యకలాపాలకు తగుమొత్తం కూడా ఖర్చుపెట్టబడింది. ఖర్చుల వివరములు ఈ దిగువ పొందుపరచబడినవి :—

### 1941 నుంచి 1951 వరకు

| | | రూ. |
|---|---|---|
| 1. | మురుగు కాల్వలు | 1,38,156 |
| 2. | రోడ్లు | 7,89,018 |
| 3. | ఆస్ఫాల్టురోడ్లు | — |
| 4. | కంకరరోడ్లు | — |
| 5. | మోరంరోడ్లు | — |
| 6. | కక్కొనుదొడ్లు | — |
| 7. | మూత్రశాలలు | — |
| 8. | స్నానపుగదులు | — |
| 9. | ఆటస్థలములు | 7,583 |
| 10. | పార్కులు | — |



*1956 ఏప్రిల్ 16 వ తేదీన జరిగిన కార్పొరేషన్ దినోత్సవం సందర్భంలో డా. బి. రామకృష్ణరావుగారు ప్రసంగించారు.*

| | | |
|---|---|---|
| 11. | రేడియోలు | 9,887 |
| 12. | చల్లని నీటి కేంద్రములు | — |
| 13. | ఫౌంటెయినులు | — |
| 14. | మార్కెట్లు | — |
| 15. | వీధి దీపాలు | — |
| 16. | క్లాక్ టవర్ | 1,197 |
| 17. | ఇండ్లనిర్మాణం | 59,528 |
| | మొత్తం ఖర్చు రూ. | 10,67,955 |

## 1951 నుంచి 1956 వరకు

| | | |
|---|---|---|
| 1. | మురుగుకాలువలు | 16,13,965 |
| 2. | రోడ్లు | 18,18,782 |
| 3. | ఆస్ఫాల్టురోడ్లు | 1,51,421 |
| 4. | కంకరరోడ్లు | 76, 289 |
| 5. | మోరం రోడ్లు | 2,87,843 |
| 6. | కక్కొసుదొడ్లు | 1,02,652 |
| 7. | మూత్రశాలలు | 57,108 |
| 8. | స్నానపుగదులు | 4,200 |
| 9. | ఆటస్థలములు | 1,24,038 |
| 10. | పార్కులు | 16,072 |
| 11. | రేడియోలు | 12,650 |
| 12. | చల్లని నీటి కేంద్రములు | 28,150 |
| 13. | ఫౌంటెయినులు | 3,700 |
| 14. | మార్కెట్లు | 5,007 |
| 15. | వీధి దీపాలు | 80,708 |
| 16. | వివిధములు | 1,98,872 |
| 17. | గుల్జార్‌హౌజ్ | 8,600 |
| 18. | ఈసామియాబజారు మార్కెటు | 1,50,000 |
| 11. | కొత్తప్రాంతాలకు విద్యుద్దీపాలు | 20,0,000 |
| | మొత్తం ఖర్చు రూ. | 49,39,557 |

మొదటి రెండుసంవత్సరాలలో కార్పొరేషను అత్యవసరమైన పౌర సౌకర్యముల కొరకు కృషిచేసింది. ముఖ్యంగా భూగర్భ మురుగు కాలువలు, దుమ్ములేని రోడ్లు వేయడంపై

శ్రద్ధవహించబడింది. మూడవ సంవత్సరంలో మూత్రశాలలు, కక్కసుదొడ్ల నిర్మాణంపై శ్రద్ధ వహించబడింది. నాల్గవ సంవత్సరంలో ఆటస్థలములు, పార్కులు, ఇతర వినోద వసతులు హెచ్చింపబడినవి. ఐదవ సంవత్సరంలో ఉద్యోగులలో తక్కువ ఆదాయపు వర్గములవారికి తక్కువ కిరాయా ఇండ్లనిర్మాణం పని ప్రారంభింపబడింది.

కార్పొరేషను చేపట్టిన నిర్మాణాలలో ముఖ్యంగా చెప్పుకోదగినది జియాగూడా వధ్యశాలను ఆధునిక పద్ధతిపై నిర్మించడం. వాటర్ కూలర్స్ (చల్లని త్రాగే నీటి కేంద్రములు) సుల్తాన్‌బజారులో ఒకటి, మచ్లీకమాన్‌లో ఒకటి నిర్మింపబడినవి. సుల్తాన్‌బజారులో భూగర్భ కక్కసు దొడ్డి, స్నానముల గదులు నిర్మింపబడినవి. బడ్జెట్టులో ప్రత్యేకంగా డబ్బును కేటాయించి, కార్పొరేషనులో క్రొత్తగా చేర్చబడిన ప్రాంతాలలో విద్యుద్దీపాలు పెట్టబడినవి. ఇప్పుడు మునిసిపల్ కార్పొరేషన్ అధ్వర్యం క్రింద 40 ఆటస్థలములు, 15 పార్కులు, 36 రేడియో సెట్లు కలవు.

## క్రమబద్ధమైన అభివృద్ధి

ప్రజలకు సౌకర్యములు ఏర్పాటు చేయుటకు, గృహ నిర్మాణం జరుపుటకు బడ్జెట్టులో కేటాయించబడిన మొత్తములు నగరంలోని అన్ని నియోజకవర్గాలకు సమానంగా పంచబడినవి; ఆ విధంగా పంచబడిన మొత్తములు ఆయా ప్రాంతాలకౌన్సిలర్లను సంప్రదించినమీదట ఖర్చుపెట్టబడినవి. అత్యవసరమైన పనులకు తగు ప్రాధాన్యమివ్వబడింది. ఇందువల్ల అందరికీ సంతృప్తికలిగింది. పట్టణంలోని పేద వర్గాలవారినీ, ధనికులనూ ఈ విషయంలో సమానంగా చూడడమైనది. ఈ విధంగా ఇంతవరకు నిర్లక్ష్యం చేయబడిన ప్రాంతాలకు ఇప్పుడు అభివృద్ధిపొందడానికి అవకాశాలు కలిగినవి.

ఆరోగ్య, పన్ను విధింపు, డ్రెయినేజి విభాగములు కూడా అనేక సత్ఫలితాలు సాధించినవి. గత ఐదేండ్లలో నగర పౌరులు ఎటువంటి అంటువ్యాధికి పాల్పడలేదు. ప్లేగు,



హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ మాజీమేయరు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు మచిలీకమాన్ వాటర్‌కూలర్ (మంచినీటి కేంద్రం) కు ప్రారంభోత్సవం చేశారు.



*హైదరాబాదు నగరంలో కొత్తగా వేయబడుచున్న సిమెంటు రోడ్డులలో ఈ రోడ్డుకూడా ఒకటి.*

కలరా, మశూచి, డిఫ్తీరియా, టైఫాయిడ్ మొదలగువ్యాధులు అదుపులోకి తేబడినవి. ఆరోగ్య విభాగం క్రింద ఆరు శిశు సంక్షేమ కేంద్రాలు, రెండు కుటుంబసంయమన వైద్యాలయములు, దంతవైద్యుడు కూడ కల ఒక మునిసిపల్ ఆసుపత్రి కలవు. నాలుగు కార్మిక సంక్షేమకేంద్రాలు కూడా కలవు. వీనిలో మూడింటిలో వైద్యసహాయం, పిల్లలకు విద్యాభ్యాసం గంజి, పాలు మొదలైనవాటి సరఫరా ఏర్పాట్లు కలవు. శిశు సంక్షేమ కేంద్రాలలో స్త్రీలకు గర్భిణీ సమయంలోను, బాలెంతలుగా వున్నప్పుడు వచ్చే జబ్బులకు చికిత్సచేయబడుతుంది. గర్భిణీ స్త్రీలకు రక్తహీనదోషము, పాండు మొదలగు జబ్బులకు ఉచితంగా మందు లివ్వబడుతాయి. ఈ శిశుసంక్షేమ కేంద్రాలలోని పిల్లలకు సాత్వికము, పుష్టికరమైన ఆహార మివ్వబడుతుంది. మునిసిపల్ ఆసుపత్రిలో మునిసిపల్ ఉద్యోగులకే గాక ప్రజాసామాన్యానికి కూడా ఉచితంగా ఔషధము లివ్వబడుతాయి. మౌలాలీ వద్ద మెహబూబ్‌బాగ్‌లో కుష్ఠురోగుల కేంద్రం కలదు. ఇక్కడ కేంద్రంలో వుండే రోగులకే కాక అదొక అంటువ్యాధిగా లేనట్టి రోగులకు కూడా చికిత్సచేయడమవుతుంది. నగరంలోని చెత్త చెదారములను బయటికి గొనిపోవుటకు లారీలు ఏర్పాటు చేయబడినవి. ఆ చెత్త చెదారములను కంపోస్టు పద్ధతిద్వారా ఉపయోగకరమైన ఎరువుగా మార్చి నగర పరిసరాలలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయుటకు తోడ్పడటం జరుగుతున్నది. ఈగలు, దోమలు మొదలగువాటిని నిర్మూలించడానికి క్రిమిసంహారక ఔషధములను చల్లేటందుకై ఒక తీఫాయంత్రం కొనబడింది. అంటువ్యాధుల నిరోధమునకు ప్లేగువ్యాధిని నిర్మూలించుటకు, మలేరియాను అరికట్టుటకు, లింగంపల్లి అంటువ్యాధుల ఆసుపత్రిని నిర్వహించుటకు కార్పొరేషను మొత్తం రూ. 2.25 లక్షలు ఖర్చుపెడుతున్నది.

ఈవిధంగా ఆరోగ్యం, పారిశుధ్యములకొరకై కార్పొరేషను తన ఆదాయముల నుంచి దాదాపు రూ. 23 లక్షలు ఖర్చు పెట్టుతున్నది.

హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్‌లో పనివారల మొత్తం సంఖ్య దాదాపు 4 వేలు. వీరి ప్రయోజనములన్నీ సరిగా కాపాడబడుతున్నవి. ఏమాత్రం నిర్లక్ష్యం చేయబడ లేదు. పనివారలకూ, కార్పొరేషనుకూ ఏదైనా వివాదం ఏర్పడినట్లయితే చట్టబద్ధమైన పద్ధతుల ప్రకారం వాటిని పరిష్కరించడమవుతుంది. కార్మిక న్యాయస్థానముల నిర్ణయములు పాటించబడుతాయి. చవుక కిరాయా ఇండ్లు, ఉచిత వైద్య సహాయం, విద్యా సంబంధమైన స్టైపెండు మొదలగు సౌకర్యములు కార్పొరేషను పనివారలకు కల్పించింది.

నగరంలో పౌరులకు వివిధ వైజ్ఞానిక, సంక్షేమ కార్య కలాపములను ఏర్పాటుచేయవలసిన బాధ్యతను కార్పొరేషన్ గుర్తిస్తున్నది. వైజ్ఞానిక కార్యక్రమముల నిర్వహణకొరకై గ్రాంట్లు ఇవ్వవలసిందిగా ఏ సంస్థ అయినా కోరినట్లయితే అట్టివారి కోర్కెలను సానుభూతి పూర్వకంగా పరిశీలించి తగువిధంగా గ్రాంట్లుమంజూరుచేయడమవుతుంది. నగరంలో అక్షరాస్యతా ఉద్యమాన్ని వ్యాప్తంచేయడానికై కార్పొరేషన్ అధ్వర్యక్రింద 10 సాంఘిక విద్యాకేంద్రాలు కలవు. దాదాపు 50 గ్రంథాలయాలకు పైగా విరాళాలు ఇవ్వడ మవుతున్నది.

పౌరులు చెల్లించవలసిన పన్నులకు బిల్లులిచ్చే పనిలో మోసములు జరుగకుండా కట్టుదిట్టంచేసి బిల్లులు సక్రమంగా జారీచేయబడునట్లుగా, ఆ విధంగా జారీచేయబడిన బిల్లులలో మళ్ళీ మార్పులు చేర్పులు చేయబడకుండునట్లుగా శ్రద్ధవహించడానికి దాదాపు ఒక లక్ష రూ.లు పెట్టి అడ్రెమా యంత్రం కొనబడింది. బిల్లుల డిమాండులకు అనుగుణంగా చెల్లింపులు కూడా క్రమంగా జరుగుతున్నవి. గత ఐదేండ్లలో పన్నుల మూలకంగా వచ్చే ఆదాయం దాదాపు రెట్టింపుఅయింది.



హైదరాబాదు నగరంలోని ఒక మురికిపేటలో క్రొత్తగా వేయబడుచున్న మురుగుపాము.

అస్తుల అంచెనాలను శాస్త్రీయపద్ధతిపై, వాస్తవ ప్రాతిపదికతో సిద్ధంచేయడానికి రీ అసెస్మెంట్ సెక్షన్ స్థాపించబడింది. రీ అసెస్మెంట్ పని దాదాపు పూర్తిఅయింది. అసెస్మెంట్ పని న్యాయబద్ధంగా జరగడంవల్ల ప్రజల అసంతృప్తికి కూడా అవకాశం ఉండదు. పైగా ఆదాయం కూడా పెరుగుతుంది.

ప్రభుత్వం డ్రెయినేజిశాఖను 1-7-1954 తేదీన కార్పొరేషనుకు అప్పగించింది. అంతవరకు అశాఖ పబ్లికువర్క్సు శాఖ క్రింద వున్నది. కార్పొరేషను ఈవిధంగా తీసుకొన్న తరువాత కొత్త డ్రెయినేజి లైనులు వేయబడినవి. ఇండ్ల కనెక్షనుల సంఖ్యకూడా ప్రతియేటా రెట్టింపు అవుతున్నది. కనెక్షను పెట్టించుకోవలసిందిగా ఇండ్లయజమానులను ప్రోత్సహించడ మవుతున్నది. అందువల్ల ఇండ్లు పరిశుభ్రంగా వుంటాయి.

కార్పొరేషన్ కోరికపై ప్రభుత్వం రూ. 11,31,233 ల మేరకు అప్పులను కొట్టివేసి, ప్రతి సంవత్సరం ఇచ్చే గ్రాంటును హాలీ రూ. 12 లక్షలకు హెచ్చించింది.

## సికింద్రాబాదు

సికింద్రాబాదులో కూడా కార్పొరేషను సాలుసరి ఆదాయం బాగా హెచ్చింది. 1951-52 లో రూ. 11,50,000 ల ఆదాయం రాగా 1956-57 సంవత్సరంలో రూ 18,27,200 ల ఆదాయం రాగలదని అంచెనా వేయబడింది. ప్రస్తుతం ఈ కార్పొరేషను ఖర్చు కూడా దాదాపు అంతేవున్నది.

1951-52 లో సికింద్రాబాదులో పబ్లికు వర్క్సుపై రూ. 1,01,700 లు ఖర్చు పెట్టబడింది. 1956-57 లో రూ. 5,10,000 లు ఖర్చుకాగలదని అంచెనావేయబడింది. కార్పొరేషను స్థాపితమైనప్పటినుంచి రోడ్లు, నీటి సరఫరా, తదితర ప్రజోపయోగకర ఏర్పాట్లకొరకై మొత్తం రూ. 29,89,000 లు ఖర్చు పెట్టబడినవి.

ప్రజారోగ్యం పరిరక్షణ విషయంలో సికింద్రాబాదు కార్పొరేషను చాలాకాలం నుంచి ఉత్తమ మైనదిగా పరిగణింపబడుతూ వచ్చినది. ప్రజలచే ఎన్నుకోబడిన కార్పొరేషనుకూడా ఈ సంప్రదాయాన్ని నిలబెట్టింది. 1946-47 లో ఒకపర్యాయం తప్ప గత 21 ఏండ్లలో నగరంలో ప్లేగువ్యాధి లేకుండాపోయింది. 1953 లో కలరావ్యాధి ఉద్ధృతంగా వచ్చింది. కాని తగుచర్యలు గైకొని వెంటనే వ్యాధిని అదుపులోకి తేవడమైనది. మునిసిపల్ ప్రాంతంలో మలేరియా వ్యాధి ఏమాత్రంలేదు. దోమలు లేకుండాచేయడానికి నిరోధక చర్యలు గైకొనబడుతున్నవి. 1953 లో మలేరియా నిరోధక ఉద్యమం విస్తృతపరచబడింది. ఇందుకొరకు నగరం ఐదు ప్రాంతాలుగా విభజింపబడింది. దోమలకు ఆలవాలమైన బావులు, నీళ్ళతొట్లు, మురికి గుంటలలో డి. డి. టి, గెమాక్సీన్ చల్లబడింది. ఇండ్లలో కూడా డి. డి. టి కొట్టబడుతున్నది. మలేరియారోగులకు పాలుడ్రిన్ బిళ్ళలు ఉచితంగా ఇవ్వడానికి తగు ఏర్పాట్లు చేయబడినవి.

ఒక వ్యాక్సినేషన్ విభాగం శాశ్వతంగా సంవత్సరం పొడుగునా పనిచేస్తూవుంటుంది. ఇందులో ఒక సూపరింటెండెంటు, ఆరుగురు వ్యాక్సినేటర్లు, ఒక ఫ్రీ వ్యాక్సినేటరు ఉంటారు. ప్రీసీజనల్ కాలంలో ఇంటింటికిపోయి టీకాలు వేయడం జరుగుతున్నది. మునిసిపల్ ఆసుపత్రిలో కూడా టీకాలు వేయబడుతూ ఉంటాయి.

ఈ ఆసుపత్రియేగాక కార్పొరేషను ఒక అంటువ్యాధుల ఆసుపత్రిని కూడా నడుపుతున్నది. ఇందులో 62 మంది రోగులకు వసతికలదు. ఒక సరసధరల ఆసుపత్రి కూడా తెరువబడినది. ఇందులో పేదవారినుంచి మందుల ధరలు మాత్రమే తీసుకొనబడుతాయి. అవికూడా అసలు ధరలు మాత్రమే. సలహా ఫీజు తీసుకొనబడదు. ప్రతిరోజు దాదాపు 100 మంది రోగులు ఈ సౌకర్యంవల్ల లాభం పొందుతున్నారు. ఈ ఆసుపత్రి ప్రయోగరీత్యామాత్రమే నెలకొల్పబడింది. అయితే ఈ ప్రయోగం విజయవంతమైనదికాబట్టి ఇటువంటివి మరి మూడు ఆసుపత్రులు తెరువబడనున్నవి.

ఎవరికి చెందకుండా వీధులలో తిరుగాడే కుక్కలను, పశువులను పట్టుకోవడానికై ప్రత్యేకంగా ఒక దళం నియమింపబడింది. ఎవరికి చెందని కుక్కలను ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన ఒక గదిలోఎలక్ట్రోక్యూట్ చేయడమవుతుంది.



మెట్టుగూడాలో నిర్మింపబడుతున్న నీటి రిజర్వాయరు.



*మోండా మార్కెటు దక్షిణభాగంపైకప్పు దిట్టం చేయబడుతున్న దృశ్యం.*

ఆహారపదార్థముల వ్యాపారం లైసెన్సులు జారీచేయబడు పద్ధతిద్వారా తరుచుగా ఆకస్మిక తనిఖీ పద్ధతిద్వారా కంట్రోలు చేయబడుతుంది. ఆహారపదార్థముల నమూనాలను పరీక్ష చేసి, అవిగనుక అనారోగ్యకరములని తేలినట్లయితే వాటిని అమ్మువారిపై కేసులు నడుపబడుతాయి.

కల్తీ ఆహారపదార్థములను పట్టుకొనే ఉద్యమమును మరింత సమర్థవంతం చేయడానికై మార్కెటులో అమ్మబడు పదార్థముల రసాయనిక విశ్లేషణ జరుపుటకు ఒక కెమికల్ లెబొరేటరీని స్థాపించవలెనని వైద్యాధికారి కొన్ని ప్రతిపాదనలుచేసినాడు. ఈవిధంగా పరీక్షచేయడం ముఖ్యంగా అంటువ్యాధులు ప్రబలివున్నకాలంలో మిక్కిలి ప్రయోజనకరమైన పద్ధతి. ఒక కెమికల్ ఎనలిస్టును (రసాయన విశ్లేషకోద్యోగి) నియమించుటకు కార్పొరేషను అంగీకరించింది.

మునిసిపల్ వధ్యశాల ఆధునిక పద్ధతులపై నిర్మింపబడింది. యోగ్యతగల ఒక పశువైద్యాధికారి దీని పనిని పర్యవేక్షిస్తూ ఉంటాడు. లాలాపేటలో ఒక ప్రైవేటు వధ్యశాల కూడా కలదు.

ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీవారు నడుపుతున్న ప్రసూతి శిశుసంక్షేమ కేంద్రానికి కార్పొరేషను ప్రతియేటా రూ. 5,000 లు విరాళమిస్తుంది. అంతే మొత్తమును మూడు కుటుంబసంయమన కేంద్రాలకు కూడా ఇస్తున్నది.

కార్పొరేషన్ క్రింద రోడ్లు ఊడ్చేపనివారు 219 మంది ఉన్నారు. చెత్త చెదారములను, మలమూత్రములను లారీలు, వ్యానులద్వారా బైటికి పంపించడం జరుగుతున్నది.

డ్రెయినేజి పద్ధతిని బాగుపరచడానికై 1952-53 లో రూ. 1,08,000 ల ఖర్చుతో పైకప్పుగల డ్రెయినులు నిర్మింపబడుతున్నవి.

మునిసిపల్ ప్రాంతమంతటా భూగర్భ డ్రెయినేజి విధానాన్ని పెట్టడానికై ఒక పథకం తయారుచేయబడింది. ఈ పథకానికి రూ. 25 లక్షలు ఖర్చుకాగలవని అంచెనావేయబడింది. ఈ ఖర్చులో నూటికి 25 వంతుల ఖర్చును భరించడానికి కార్పొరేషను ఆమోదిచింంది. ఈ పని జరుగుతున్నది. నగరంలోని పాతరకపు కక్కాసుదొడ్లను మార్చి ఆటో ఫ్లష్‌టైప్‌దొడ్లుగా నిర్మించడమైనది. అనేక స్థలములలో గల మూసివేయబడి వుండు మూత్రశాలలను ఆటోమాటిక్

ఫ్లషింగ్ పద్ధతి ప్రకారం నిర్మించడమైనది. కొత్తగా కార్పొరేషనులో చేర్చబడిన కొన్ని ప్రాంతాలలో ఓపెన్ సర్ఫేజి డ్రెయినులు, డ్రైనుపైపు కక్కూసుదొడ్లు ఏర్పాటు చేయబడినవి.

నగర వీధులలో దీపాలు పెట్టడానికై కార్పొరేషను ప్రతి యేటా రూ. 75,000 లు ఖర్చుపెడుతున్నది.

అనేక వాడలలో కొత్తరోడ్లు వేయబడుతున్నవి. ప్రస్తుతమున్న రోడ్లపై సిమెంటు, అస్ఫాల్టు, కంకరవేసి దుమ్ము రేగకుండా చేయడమవుతున్నది. రోడ్ల మరమ్మతుకు ప్రతియేటా లక్ష రూ.లు ఖర్చుఅవుతున్నవి. ఇటీవల తలపెట్టబడిన అభివృద్ధి కార్యక్రమంవల్ల దెసాస్మరేజ్ వీధి, సుభాస్ రోడ్డు, సరోజినీదేవి రోడ్డు, కలవ అదితీ ప్రాంతములకు చాలా మేలు కలిగింది. బతకమ్మకుంట, బేగంపేట, లాలాపేటలలో కొత్తగా మోరంరోడ్లు వేయబడినవి.

## నీటి సరఫరా

సికింద్రాబాదు ఎత్తైన ప్రదేశంలో ఉండడంచేత హైదరాబాదు వాటర్‌వర్క్సు నుంచి వచ్చేనీటిని 18 అం. వ్యాసం, 8850 అడుగుల పొడువుగల సి. ఐ. రైజింగ్ మెయిన్ ద్వారా 175 సర్దారు పటేలురోడ్డులో 175 అడుగుల ఎత్తునవున్న రాతి కట్టడపు రిజర్వాయరులోనికి పంపు చేయడమవుతుంది. ఈ రిజర్వాయరులో 30 లక్షల గ్యాలనుల నీరు పట్టుతుంది. దీని నుంచి నగరంలోని మూడింట రెండువంతుల జనాభాకు నీరు సరఫరా అవుతుంది. మిగతా జనాభాకు నేరుగా రైజింగ్ మెయిన్ నుంచే నీరు సరఫరా అవుతుంది. కార్పొరేషను వెంకటరావునగర్‌లో రూ. 1,00,900 ల ఖర్చుతో ఒక కొత్త రిజర్వాయరును నిర్మించింది.

నగరమునకు సగటున ప్రతిరోజు 19.30లక్షల గ్యాలనుల నీరు సరఫరా అవుతుంది. అంటే సగటున తల 1 కి 16.6 గ్యాలనుల నీరు లభిస్తున్నది. ఈ నీటి సరఫరా ప్రతియేటా రూ. 1,19,200 ల ఖర్చుతో హైద్రాబాదు వాటర్‌వర్క్సు నుంచి చేయబడుతున్నది. రాణీగంజి పంపింగ్ స్టేషన్ నిర్వహణకు రూ. 60,000 లు ఖర్చు అవుతున్నవి.




*సికింద్రాబాదులో సరసమైన ధరలకు మందులు లభించే ఔషధాలయం.*

నీటి సరఫరా విభాగంపై వచ్చే ఆదాయాన్ని హెచ్చించే ఉద్దేశంతో ప్రైవేటు వినిమయదారులకు వెయ్యిగ్యాలనులకు నిర్ణయించబడిన హారీ రూ. 0-8-0 ఫ్లాట్ రేటు, వివిధ రకముల బోరింగ్ ఫీజు 1953 ఏప్రిల్ 1 వ తేదీనుంచి సవరించబడినవి. నీటి పన్ను పాతరేటు కూడా 1953 అక్టోబరు 1 వ తేదీనుంచి నూటికి 3 వంతులనుంచి $4\frac{1}{2}$ వంతులకు హెచ్చింపు చేయబడింది.

రూ. 25 లక్షల ఖర్చుతో నీటి పంపిణీ విధానాన్ని పునర్నిర్మాణం చేయడానికై ఒక పథకం తయారుచేయబడింది.

లాలాపేటకు చెందిన 5000 ప్రజలకు నీటి సరఫరాచేస్తున్న బావి శిథిలావస్థలో వున్నందున ఆ పేట ప్రజలకు పైపుల ద్వారా నీటి సరఫరా చేసేందుకై కార్పొరేషన్ ఒకపథకాన్ని అమలుపరచింది. 10,000 గ్యాలనుల నీరు పట్టే ఒక రిజర్వాయర్ నిర్మింపబడింది. పై బావినుంచి ఈ రిజర్వాయరులోకి నీరు పంపుచేయబడి, దాని నుంచి జి. పి. పైపులద్వారా ఆ ప్రాంతాని కంతటికీ నీరు సరఫరా చేయబడుతుంది. దాదాపు 20 వాటర్ స్టాండ్ పోస్టులు నెలకొల్పబడినవి.

మెట్టుగూడా ప్రాంతానికి కూడా ఇటువంటి పథకమే అమలుపరచబడింది. వీలుకాని ప్రాంతాలలో బావుల త్రవ్వకానికి ప్రోత్సాహ మివ్వబడుతున్నది.

1953 అక్టోబరు 1 వ తేదీ నుంచి జనరల్ టాక్సు నూటికి 7 వంతులనుంచి $8\frac{3}{4}$ వంతులకు హెచ్చించబడింది.

1953-54 సంవత్సరంలో ఊడ్పుపనివారల ఇండ్లను మరమ్మతుచేసే నిమిత్తమై కార్పొరేషన్ యొక్క స్థాయీ సంఘం రూ. 2500 లు మంజూరుచేసింది.

కార్పొరేషన్ నియమించిన కూలీలకు మేలు కలుగచేసే నిమిత్తమై ఒక సహకార పరపతి సంఘం స్థాపించబడింది. ఈ సంఘమును స్థాపించుటకు ఆరంభంలో అయ్యే ఖర్చులను ఆదుకోవడానికై మునిసిపల్ నిధులనుంచి వడ్డీ లేకుండా రూ. 3,000 లు సంఘానికి అప్పుగా ఇవ్వడమైనది. పరపతి సంఘం కార్మికులకు ఇంకా అప్పులిచ్చుటకై 1953 లో కార్పొరేషను మరి రూ. 3 వేలు ఇచ్చింది.

కార్మికులకొరకు మ్యూచువల్ బెనిఫట్ ఫండు (పరస్పర శ్రేయోదాయక సంఘం)ను ప్రారంభించుటకు కార్పొరేషన్ అంగీకరించింది.

కార్పొరేషను 5 సాంఘిక విద్యా కేంద్రాలను నడుపుతున్నది. వీటిలో నాలుగు పురుషులకొరకు, ఒకటి స్త్రీల కొరకు ఉద్దేశించబడినవి. ఈ కేంద్రంలో మెట్రికులేషన్ పరీక్ష ప్యాసైన అభ్యర్థులు ఉపాధ్యాయులుగా నియమింపబడినారు.

మునిసిపల్ కార్పొరేషన్ గ్రంథాలయం ఒకటి తెరువబడింది. అనేక పేటలలో క్రొత్త పార్కులువేయబడినవి.

మునిసిపల్ హద్దులలోపలగల శ్మశానస్థలము లన్నింటిని రిజిష్టరుచేయడం కూడా జరుగనున్నది.

## గృహవసతి

పట్టణ అభివృద్ధి సంఘం మారేడుపల్లి గ్రామ అభివృద్ధి పథకాన్ని చేపట్టి రూ 3,01,018 లు వ్యయంచేసి 130 ఇండ్లను స్వాధీనపరచుకొని, ఒక్కొక్కటి రూ. 7000 ల ఖర్చుతో 54 ఇండ్లను నిర్మించింది.

క్రొత్తబోయిగూడా (వెంకటరావు నగర్)లో పేదతరగతులవారి కొరకై రూ. 20,000 ల ఖర్చుతో 14 ఇండ్లు నిర్మింపబడినవి. వీటిపై కప్పు గూనాపెంకుతో వేయబడింది. ఈ ప్రాంతంలోనే 36 బ్లాకులు నిర్మించవలెనని ఒక పథకం వేయబడింది. వీటికిగాను 16 ఇండ్ల నిర్మాణం పూర్తి అయింది. సత్యనారాయణపురం (హైదర్‌బస్తీ)లో హిమ్మత్ నగర్ (రెజిమెంటల్‌బజారు)లో రెండు చిన్న మార్కెట్లు కట్టబడినవి.

మారేడుపల్లిలో మధ్యతరగతులవారికి మరి 20 ఇండ్లు కట్టడానికై పట్టణ అభివృద్ధి సంఘంవారు సేకరించిన స్థలాన్ని కార్పొరేషనుకు స్వాధీనపరచినారు.

పేదతరగతుల వారికి ఇండ్లు కట్టడానికై కార్పొరేషన్ అనేక గృహవసతి పథకములను తయారుచేసింది. ఈపథకములకు రూ. 75 లక్షలు ఖర్చుకాగలవు. వీటిలో మారేడుపల్లి గ్రామాభివృద్ధి పథకం పూర్తికావడానికి రూ. 11 లక్షలు కావాలి. ఈ పథకం పూర్తి అయితే దాదాపు 310 కుటుంబాలకు గృహవసతి ఏర్పడుతుంది. సీతాఫల్మండి పథకానికి రూ 16 లక్షలు ఖర్చు అయి, వెయ్యి పేదకుటుంబాలకు గృహవసతి ఏర్పడుతుంది. క్రొత్త బోయిగూడాలో రూ. 1,67,900 ల వ్యయంతో 85 ఇండ్లు నిర్మింపబడగలవు. గయాదీన్ కాంపౌండు పథకానికి దాదాపు రూ. 6 లక్షలు ఖర్చు అయి, 57 ఇండ్లు తయారవుతాయి. విక్టోరియాగంజ్ పథకం క్రింద రూ. 16 లక్షలు ఖర్చుపెట్టి 52 దుకాణములు, 104 ఇండ్లు నిర్మించవలెనని తలపెట్టబడింది. జనరల్ బజారు పథకానికి రూ. 26 లక్షలు ఖర్చుఅవుతాయి. బండిమేట్ అభివృద్ధి పథకానికి రూ. 21,500 లు ఖర్చుకాగలవు.

హిస్సాంగంజ్ మోండాలో ఒక షాపింగ్ సెంటర్ (అంగళ్ళ కేంద్రం) ను నిర్మించడానికి రూ. 1,55,000 లు ఖర్చు కాగలవని అంచెనావేయబడింది. ఈ పథకం క్రింద 105 ఇండ్లు నిర్మింపబడుతాయి. క్రింది అంతస్తు నిర్మాణం పూర్తి చేయబడింది.

[తరువాయి ౼౨వ పుటలో]

# ★ హైదరాబాదులో బౌద్ధ క్షేత్రాలు ★

ఖాజా మహమ్మద్ అహ్మద్
క్యూరేటర్, హైదరాబాదు మ్యూజియం.

దక్కను పూర్వ చరిత్ర కాలగర్భంలో మరుగు పడి ఉన్నది. ఐతరేయ బ్రాహ్మణములో దక్కను ప్రస్తావన వున్నది. ఇది క్రీ. పూ. 500 సంవత్సరాలకు చెందినది. భారతదేశ ద్వీపకల్ప భాగంలో నివసిస్తున్న కొన్ని తెగల వారిలో ఆర్య నాగరికత చిహ్నము లున్నట్లు ఐతరేయ బ్రాహ్మణములో పేర్కొనబడివున్నది. ఆ తరువాత మళ్ళీ దక్కను ప్రాంతపు ప్రస్తావన మెగాస్తనీసు వ్రాసినవృత్తాంతములలో కలదు. ఈతడు ప్రథమ మౌర్యరాజు దర్బారులో సెల్యూకసు దూతగా వచ్చాడు. మెగాస్తనీసు క్రీ. పూ. 200 లో పాటలీపుత్రమును దర్శించాడు.

భారతదేశమునకు మధ్యభాగంలో మెగాస్తనీసు చాలకాలం ఉండడంవల్ల చారిత్రక విషయాలలో అతడు వ్రాసిన వృత్తాంతములకు హెచ్చు ప్రాధాన్యం కలిగింది. కాని దురదృష్టవశాత్తు అతడు వ్రాసినవి మనకు చెదరువాటుగా కొన్ని కొన్ని మాత్రమే లభించాయిగాని పూర్తిగా దొరకలేదు. అతడు సిద్ధపరచిన దక్షిణ భారత జాతుల పట్టికను క్రీ. శ. మొదటి శతాబ్దానికి చెందిన రోమన్ ప్రామాణికుడు ప్లినీ తన ప్రకృతి చరిత్రయొక్క ఆరవ గ్రంథంలో ఉల్లేఖించాడు. కాని అతడి రచనలో కూడా దక్కను సరిగా వర్ణించబడలేదు. పైగా అప్పటికే అది చాలా అస్పష్టంగా కూడా వున్నది. ఆ కాలంవరకు బ్రాహ్మణ ప్రభావంగాని లేక ఆర్య ప్రభావంగాని దక్కనులోనికి చొచ్చుకొని వచ్చిన జాడ లేమీ కన్పించవు. అయితే దాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం బ్రాహ్మణ ఆర్య సంప్రదాయముల ప్రభావముతే వింధ్య సత్పురా పర్వతములకు ఎగువన వర్ధిల్లినవి.

క్రీ పూ. 255 లో చరిత్ర ప్రసిద్ధుడైన మౌర్య చక్రవర్తి అశోకుడు బౌద్ధమతమును తన సామ్రాజ్యంలో రాజమతముగా పెంపొందించి ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు తన దూతలను, రాయబారులను పంపాడు. వీరు దక్కను ప్రాంతానికి కూడా వచ్చారు. ఈ కాలంలో దక్కనులో మత విషయకమైన ప్రభావం ఏమీలేదు. అందుచేత దృఢమైన పునాదులపై ఏర్పడినట్టి మత సిద్ధాంతాలను స్వీకరించడానికి ఏదో ఒక రూపంలో మతాంతరీకరణకూ ఈ ప్రాంతం అప్పుడు సంసిద్ధమైవున్నది.

## అశోకుని శాసనాలు

బౌద్ధమత ప్రచారకులు విడిచిపోయిన చిహ్నములు అసంఖ్యాకమై ఉండవచ్చును. కాని రాయచూరు జిల్లాలో రాళ్ళపై, బండలపై చెక్కబడివ అశోకుని శిలాలేఖనములు మూడు విధములుగా ఉన్నవి. వీనిలో ఒకటి మాస్కిలో ఒక గుహాలోపలి బండపై వున్నది. మరి రెండు కొప్పల్ పరిసరములోనున్న గావిమట్, పాల్కిగుండులలో కలవు. మాస్కి శాసనం కనుగొనబడడం భారతదేశ ప్రాచీన చరిత్రలో అతిముఖ్యమైన విషయం.

ఇంతకు పూర్వం కనుగొనబడిన అశోకుని శాసనములలో "దేవానాం ప్రియ" అని మాత్రమే వ్రాసివున్నది కాని ఆయన పేరులేదు. కాని మాస్కి శాసనంలో ఇవి రెండూ ఉండడంచేత అది అశోకుని



బుద్ధజయంతి : *బుద్ధుని 2500 వ మహాపరినిర్వాణ జయంతిని జరుపడానికై 1956 మే 24 వ తేదీన హైదరాబాదు నగరంలోని ప్రభుత్వ మహిళా కళాశాల ఆవరణలో బహిరంగసభ జరిగిన దృశ్యం.*

శాసనము అవునో కాదో అని పొడమిన సందేహములు నివారణమైనవి.

బుద్ధుని సందేశం యొక్క ప్రభావం నేటి తరం వారికివలెనే దక్కను ప్రాంతంపై కూడా అతి త్వరగా పడింది. నిర్ణీతమైన ఆధారాలేమీ కన్పించక పోయినప్పటికీ కొద్దికాలంలోపలనే బుద్ధుని నీతి సూత్రములు, సిద్ధాంతములు దక్కనులో ప్రభావం పడవేసినవనీ ప్రజల నిత్యజీవితంలోను సంస్కృతిలోను వాటి ప్రభావం ఉండినదనీ, ఈ విధంగా ఏవో అప్పుడప్పుడు కొన్నికొన్ని సందర్భాలలో తప్ప ఇతరత్రా దాదాపు వెయ్యి సంవత్సరాల వరకు బౌద్ధ సిద్ధాంతముల ప్రభావం వర్ధిల్లినదనీ భావించడానికి తగు నిదర్శనములు కలవు.

ఉత్తర హిందూస్థానంలో వలెనే దక్కనులో కూడా బౌద్ధమతానికి రెండు విశిష్ట సంప్రదాయములుండేవి. మొదటిసంప్రదాయము హీనయానము. ఈ సంప్రదాయంలో బుద్ధుని విగ్రహముల ఆరాధనలేదు. ఇట్లా క్రీ. శ. రెండవ శతాబ్దంవరకు గడచిపోయింది. ఆ తరువాత గౌతమీపుత్ర శాతకర్ణి నాయకత్వం క్రింద దక్కనులో పెద్ద ఉద్యమం బయలుదేరింది. బౌద్ధమతమునకు వ్యతిరేకముగా గౌతమీపుత్ర శాతకర్ణి సాహసకృత్యములు అతడి నాసిక్ శాసనంలో ఈ విధముగా స్తుతించబడినవి :-

"కర్తవ్యంపట్ల, ప్రాపంచిక సంపదపట్ల, వాంఛల పరిపూర్తికీ ఆయన తగు శ్రద్ధ వహించాడు. ప్రతాపమునకతడు కాణాచి. ఏకైక విలు


MAP
OF
HYDERABAD STATE
SHOWING BUDDIST SITES.
SCALE INCH = 16 M.
1. KONDAPUR.
2. PATI-GADDA.
3. TOUL-KATTA.
4. TRIMAL-GIRI
5. GAJUL-BANDA.
6. PANI-GIRI
7. NAGARAM.
8. VARDHAMAN KOAT.
9. SINGARAM.
10. NAGAWARAM.
11. MAHASANGHI.
12. YELLESHWARAM.
13. NAYALLAKONDAPALLE
14. KARKONDA.
15. ASHWAR-PET.
16. LINGSUGUR.
17. MASKI.
18. KOPPBAL.
GHOTOTKATCH
AJANTA
PITALKHORA
ELLORA
AURANGA BAD
AURANGABAD
PARBHANI
ADILA BAD
BHIR
NANDED
NIZAMABAD
KARIM NAGAR
PEDDABANKUR
OSMANA BAD
TER
BIDAR
MEDAK
WARANGAL
HYDERABAD
NALGONDA
GULBARGA
MAHBUBNAGAR
RAICHUR
N
S

విద్యకాదు. ఏకైకనాయకుడు. బ్రాహ్మణులకు ఏకైక సంరక్షకుడు. బ్రాహ్మణజాతి అభివృద్ధి కొరకై ఆయన ఎన్నో ఆధారములు కల్పించాడు. కులమతముల అయోమయత్వాన్ని ఆయన అరి కట్టాడు. ఆయనచేసిన ఘనకార్యములు రాముడు, కృష్ణుడు, అర్జునుడు, భీమసేనుడు మొదలుగా గల వారి కార్యములతో పోల్చదగినవి. నభగుడు, నహుషుడు, జనమేయుడు, సాగరుడు, యయాతి, రాముడు, అంబరీషుడు మున్నగు వారివలె ఆయన పరాక్రమవంతుడు. ఆయన అనేకయుద్ధము లలో తన శత్రువులను దునుమాడి, క్షత్రియులకు గర్వభంగంచేసి, శాక్యులను యవనులను పల్లవు లను నాశనంచేసి, ఖగ్రతులను రూపురేఖలు లేకుండాచేశాడు.''

దీని తరువాత బౌద్ధమతం తాత్కాలికంగా వెనుకపడిపోయింది. ఆ తరువాత మహాయాన సంప్రదాయం వచ్చింది. ఇది బహుశా క్రీ. శ. ఒకటవ శతాబ్దంలో ఆరంభమై, అస్తిత్వంకోసం అనేక సంవత్సరాలు ఘర్షణపడి చివరకు ఎనిమిదవ శతాబ్దంలో అంతరించిపోయింది.

## ఆంధ్రుల అండదండలు

ప్రథమ సంప్రదాయమైన హీనయానము నిశ్చల మైన మానవుని సమానత్వాన్ని బోధించి, మనిషికీ మనిషికీ మధ్య ప్రేమ ప్రాతిపదికగా మానవ సంబంధాల విషయంలో సద్భావ సహకారములను ప్రబోధించింది. ప్రాథమికమైన ఈ సూత్రమే సంఘంలో రాజ్య విధానంలో అన్ని కార్యకలా



పబ్లిక్ గార్డెన్సులోని జూబ్లీహాలులో బౌద్ధకళాప్రదర్శనానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం సల్పారు.



*బౌద్ధకళా ప్రదర్శనంలో ఒక చిత్తరువును డా. రామకృష్ణారావుగారు వీక్షిస్తున్నారు.*

పాల నిర్వహణలో ప్రభావం కలిగి ఉండేది. ఫలితంగా సాంఘిక పరిష్కారము, ఐకమత్యము సాధ్యమయింది. సాంఘికంగా ఇటువంటి ఉత్తమ స్థితి ఏర్పడడంవల్ల మానవునిలోని ప్రతిభ స్వేచ్ఛగా బహిర్గతంకావడానికి అవకాశంకలిగింది. ఇట్టి నైతిక సూత్రాలపై వ్యక్తియొక్క శిక్షణ జరగడం వల్ల సమాజంలో విద్యా, సాంఘిక, వైజ్ఞానిక, నైతిక అభ్యున్నతి సాధ్యమయింది. ధనికులు, పేదవారు, అన్నితరగతులవారు కనికరము, జాలి, ఔదార్యం, సత్యం, నైర్మల్యం, శాంతం మొదలగు సద్గుణములను పెంపొందించుకొన్నారు. ఈవిధంగా అనేకులు ఆధ్యాత్మిక అంతర్దృష్టిని ఏర్పరచుకున్నారు. మానవుణ్ణి అసంస్కృతునిగా చేసే కామం, పాశవికత, క్రౌర్యం, క్రోధం, గర్వం, అసూయ మొదలగు దుర్గుణములను త్యజించజొచ్చారు.

హీనయాన సంప్రదాయం ప్రారంభమైన మొదటి రోజులలో శాతవాహనులు, శాతకర్ణులు అని వ్యవహరింపబడే ఆంధ్రరాజులు ఆ సంప్రదాయమును గట్టిగా బలపరచి అండగా నిలిచారు. నైతికంగా వైశిష్ట్యం గల ఆ ఉద్యమాన్ని పోషించి అభివృద్ధిపరచడానికి వారు తాముచేయగలిగినదంతా చేశారు. సాంచీలోని ఒక శాసనాన్ని బట్టి ఆంధ్ర శిల్పులు, తాపీ పనివారు ఆ స్తూపం యొక్క దక్షిణ ద్వారాన్ని నిర్మించినట్లు తెలియవస్తున్నది. సాంచీలోని ద్వారము లన్నిటికంటె ఆంధ్రులు నిర్మించిన ద్వారం చాలా సుందరమైనదనీ, సమకా

లిక శిల్పమున కిదిఉత్తమమైన నమూనాఅనిభావింప బడుతున్నది. వారి నిత్యజీవితమునకు, సంస్కృతికి సంబంధించిన అవశేషాలను నేను హైద్రాబాదు రాష్ట్రంలోని దాదాపు 20 స్థలాలలో త్రవ్వి తీయించాను. ఆ నాటి ప్రజల జీవనమును గూర్చిన ఎన్నో విశేషాలు అవి మనకు తెలియజేస్తున్నవి. ఈ రాష్ట్రంలో బౌద్ధమతం ఎట్లా విస్తృతంగా వ్యాపించిందో తెలియజేసే ఉద్దేశంతో చారిత్రక మైన బౌద్ధస్థలములను గూర్చి సంక్షిప్త వివరణము లిస్తున్నాను. వీటిని గూర్చి ఇంకను వివరంగా తెలుసుకొనగోరువారికి ఇతర సారస్వతము కలదు.

రాళ్ళను చెక్కి శిల్ప నిర్మాణములనుచేయు కళ ఒక్క భారతదేశానికి మాత్రమే చెందినది కాదు. ఇటువంటి నిర్మాణాలు ఈజిప్టు, అస్సీరియా, మెసొపొటేమియా, పర్షియా, దక్షిణఅమెరికా మున్నగు దేశములలో కూడా అంతకు ముందే కలవు. బౌద్ధ మతస్థులు విదేశాలతో సంబంధములు కలిగియుండుట వల్లను, గౌతమీ పుత్రుని నాసిక్ శాసనంలో విదేశజాతులు ఈ దేశంలోనికి చొచ్చుకొనివచ్చినట్లు చెప్పబడి ఉండుటచేతను మరికొన్ని ఇతర కారణ ముల చేతను విదేశముల నుంచి శిల్పులు, రాళ్ళు చెక్కువారు ఈ దేశమునకు వలసవచ్చినారు. అభి వృద్ధి చెందని కళకు సంబంధించిన ప్రయోగ కార్య ములు వేటినీ భారతదేశస్థులు గాని లేక దక్కను ప్రాంత ప్రజలుగాని చేపట్టినట్లు కన్పించకపోవుట చేత ఈ విధంగా భావించవలసివస్తున్నది. అయితే ఇంతటి ప్రావీణ్యం గల కళ ఒక్కమారే మనదేశం లో ప్రవర్ధిల్లింది. ఆ కళ కూడా మహోన్నతమైన స్థితికి రాగలగడం మరీ ఆశ్చర్యకరం.

## రాళ్ళను తొలిచి నిర్మించిన ప్రాచీన నిర్మాణాలు

### పితల్ కోరా :

హైద్రాబాదు రాష్ట్రంలో రాళ్ళను తొలిచి నిర్మించిన ప్రాచీన బౌద్ధనిర్మాణాలలో పితల్ కోరా గుహలు చెప్పదగినవున్నవి. పితల్ కోరా సెంట్రల్ రైల్వేలోని చాలీస్‌గాం రైలుస్టేషనుకు సుమారు 12 మైళ్ళ దూరంలో వున్నది. ఇక్కడ ఒక చైత్య మందిరం, కొన్ని విహారములు ఉన్నవి.

### అజంతా :

హీనయాన, మహాయాన కాలములకు చెందిన బౌద్ధ శిల్పావశేషాలు అజంతాలో కలవు. ఇచట 29 గుహలున్నవి. ఈ గుహలు, వీటిలోని చిత్రాలు చెక్కడములను గూర్చి తెలుసుకొనడానికి పుష్కలంగా సారస్వతం కలదు.

### ఘటోత్కచ గుహలు :

అజంతా గుహలనుంచి పదిమైళ్ళ దూరంలో ఈ గుహలు కలవు.

### ఔరంగాబాదు :

ఔరంగాబాదులో బౌద్ధగుహలు చాలా కలవు. ఈ గుహలు మఖ్బరా వెనుక గల కొండలలో ఉన్నవి.

### ఎల్లోరా గుహలు :

ఎల్లోరాలో 1 మొదలు 13వరకు గల గుహలు బౌద్ధమతమునకు సంబంధించినవి. వీనిలో కొన్ని గుహలలో చూడదగిన శిల్పకళా విన్నాణం కలదు.

### కర్కొండ :

ఖమ్మంజిల్లాలో కొత్తగూడెమునకు సమీపమున గల కర్కొండలో రాళ్ళను చెక్కి నిర్మించిన దగోబాలు, మఠములు కలవు.

### తేర్ :

ఇది ఉస్మానాబాదు జిల్లాలో వున్నది. ఇక్కడ ఇటుకలతో నిర్మింపబడిన చైత్యము కలదు. ఇది కడు ప్రాచీనమైనది. కొండాపూరులో బయల్పడినట్టి అవశేషములే ఇచట కూడా కనుగొనబడినవి.

### మాస్కి :

ఇది రాయచూరు జిల్లాలో వున్నది. ఇచట అశోకుని శాసనమొకటి కలదు. "దేవానాంప్రియ" అంటే అశోకుడేనని ఈశాసనంవల్లనే మొట్టమొదటి సారిగా నిశ్చయంగా తెలియవచ్చినది. ఇక్కడ త్రవ్వకములు జరుపబడుతుండగా బుద్ధుని శిరస్సు, ప్రతిమ ఒకటి బయటపడినది. ఇది స్ఫటికముతో చాలా అందముగా చేయబడివున్నది.

**కొప్పల్ :**

ఇది హైదరాబాదుకు పశ్చిమోత్తరాన 43 మైళ్ళ దూరంలోవున్నది. షోలాపూరురోడ్డుపై 38వ మైలు వద్దనుంచి ఒక కచ్చారోడ్డు ఈ క్షేత్రానికిపోతుంది. ఈ కచ్చారోడ్డు 5 మైళ్ళపొడవున వుండి మోటార్లు పోవుటకు అనుకూలముగా నున్నది. ఇక్కడ చైత్య మందిరములు, మఠములు, ఇతర నిర్మాణములు బైటపడినవి. ఇతర చారిత్రక శిథిలములు కూడా త్రవ్వితీయబడినవి. ఇక్కడత్రవ్వితీయబడినమూర్తులు కళా విషయకంగా గొప్ప ప్రమాణములను కలిగి వున్నవి. ఇక్కడ ఒక వస్తుప్రదర్శనశాల (మ్యూజియం) కూడా స్థాపించబడింది. అందులో ప్రశస్తమైన మృణ్మయ పాత్రల నమూనాలు, ఇతర చారిత్రక వస్తువులు పెట్టబడినవి.

**పత్తిగడ్డ, తాళ్ళకట్ట :**

ఈ రెండు స్థలములు కొండాపూరునుంచి ఐదు మైళ్ళ దూరంలో కలవు. కొండాపూరులో బయల్పడినట్టి అవశేషములే ఇచట కూడా బైటపడినవి.

ఫణిగిరి హైదరాబాదు నుంచి 80 మైళ్ళ దూరములో ఉన్నది. హైదరాబాదునుంచి జనగామవరకు రైలులో పోయిన అక్కడి నుంచి 30 మైళ్ళదూరంలో ఈ స్థలం వున్నది. గ్రామానికి దగ్గరగా నున్న ఒక గుట్టపై బౌద్ధ అవశేషములు బయల్పడినవి. వీనిలో స్తూపములు, చైత్యములు, ఆలయములు కలవు. ఇచట జరుపబడిన త్రవ్వకముల వల్ల తిన్నని సున్నపురాయిలో తొలచబడిన కళా ఖండములు బైటపడినవి. ఇవి అమరావతి శిల్పములను పోలి వున్నవి. హెల్లెనిస్టిక్ ప్రభావంగల ఒక అర్థాన్ని ప్రతిమ ప్రత్యేకంగా చూపదగినున్నది.

**గాజులబండ, నాగారం, వర్ధమానకోట, సింగారం :**

ఈ స్థలములు ఫణిగిరి నుంచి 6 మైళ్ళదూరంలో వున్నవి. ఇక్కడ స్తూపములు, చైత్యములు, సున్నపురాయిని తొలిచి చెక్కిన వస్తువులు బయల్పడినవి. గాజులబండ సన్నగార ప్రతిమలు, హెల్లినిస్టిక్ ప్రభావంగల నాగారం విగ్రహములు ప్రత్యేకంగా చెప్పుకోదగినవి.

**ఏలేశ్వరం :**

ఇది కృష్ణానది ఎడమ ఒడ్డున పూర్వకాలంలో గొప్ప వ్యాపార మార్గంగా పేరు పొందినచోట ఉన్నది. ఇచట కూడా బౌద్ధ అవశేషములు కనుగొనబడినవి. సున్నపురాతితో చేయబడిన ఈ రెండు ఆయక స్తంభములు ఇప్పటికిని నిటారుగా నిలబడి వున్నవి.

**మహా సంఘి :**

ఇది ఏలేశ్వరానికి పశ్చిమోత్తర దిశన దాదాపు 20 మైళ్ళ దూరంలో ఉన్నది. పేరునుబట్టే ఇది ఒకానొక బౌద్ధసంప్రదాయపు సన్యాసులకు చాలా ముఖ్యమైన కేంద్రమని తెలుస్తున్నది. ఇక్కడ స్తూప శిథిలములు, ఇతర బౌద్ధనిర్మాణములు బయల్పడినవి.

**నాగవరం :**

ఇది నల్లగొండ జిల్లాలో నల్లగొండ-భోనగిరి రోడ్డుపై వున్నది. ఇచట కొన్ని బౌద్ధకట్టడములు బయల్పడినవి.

**పెద్ద బంకూరు :**

ఇది కరీంనగర్ జిల్లాలో వున్నది. త్రవ్వకములు జరుగుచుండగా ఇక్కడ బౌద్ధ కట్టడములు కొన్ని బైటపడినవి.

**అశ్వారావుపేట, నేలకొండపల్లి**

ఖమ్మం జిల్లాలో తూర్పుదిశ చివరన అశ్వారావుపేట, పడమటిదిశ చివరన నేలకొండపల్లి కలవు. ఇక్కడ కూడా బౌద్ధయుగమునకు చెందిన కట్టడములు బయల్పడినవి.



# త్వరితగతిని అభివృద్ధి : ప్రజలలో వినూత్న చైతన్యం

బీదరు, జహీరాబాదు జాతీయ వికాస కేంద్రాలను 1955 ఏప్రిల్ నెలలో సామాజికాభివృద్ధి బ్లాకులుగా మార్చడం జరిగిన ఒక సంవత్సరం లోపల వాటికి కేటాయింపబడిన మొత్తం డబ్బులో నూటికి 80 వంతులు ఖర్చు పెట్టబడింది.

దీనిని బట్టి ఈ బ్లాకుల నిర్వహణలో ప్రభుత్వాధికారులు వహించిన శ్రద్ధాసక్తులు, వారు చూపిన ఉత్సాహం, ప్రజలు ఉత్సాహంతో ఇచ్చిన సహకారం విదితమవుతున్నవి. ఈ బ్లాకులక్రింద తలపెట్టబడిన పథకాలన్నీ బ్లాకుల నిర్ణయం జరిగిన మూడు నెలల్లోనే అమలుపరచ బడినవి. రెండు వారాల లోపలనే బడ్జెట్ మంజూరీ పొందబడింది. సామగ్రి సరఫరా కొరకు ఎక్కువ కాలం వేచిఉండ నక్కర లేకుండా ఒక్క రోజులోనే కృత్రిమ గర్భోత్పత్తి వంటి పథకాలు ప్రవేశ పెట్టబడినవి. రెండు నెలల పదిహేను రోజుల కాలంలోనే జహీరాబాదులోని మన్నా ఎఖేళీలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, కళలు చేతి పరిశ్రమల కేంద్రం స్థాపించ బడినవి. చేతి పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు, గ్రామీణ గృహవసతి, భూములకు నీటి పారుదల మున్నగు వాటి కొరకై రూ 7 లక్షలదాకా అప్పులివ్వబడినవి. ఈ అప్పులు అతి త్వరగా ఇవ్వడం చేత ఈ కార్యక్రమం యొక్క మొదటి సంవత్సరంలోనే అనేక సత్ఫలితాలు కలిగినవి. 300 బావులు త్రవ్వబడినవి. గ్రామాలలో క్రొత్తచేతిపరిశ్రమలు ప్రారంభింపబడినవి. ఇంత త్వరితగతిని అభివృద్ధికార్యక్రమం అమలు జరుగడాన్ని చూచి అందరూ ఆశ్చర్య పడ్డారు.

లభించిన అవకాశాలనే చక్కగా వినియోగించి గృహవసతి, ఆరోగ్యం, అధికోత్పత్తి, ఉత్తము జీవన ప్రమాణం, మనోరంజకమైన పరిసరాల ఏర్పాటు మున్నగువాని విషయంలో మాటలతో గాక చేతలతో ఆచరణరీత్యా ప్రజలకొక క్రొత్త మార్గం చూపబడింది. ఇంతేగాక వారిలో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించి, స్వయం కృషిపట్ల ఉత్సాహం కలిగించి, సంతృప్తికరమైన అభివృద్ధిని సాధించాలనే పట్టుదల, ఉత్సాహం కల్పింపబడినవి.

బీదర్ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమం రెండున్నర ఏండ్లక్రితం ప్రారంభమయింది. 1953 అక్టోబరు 2 వ తేదీన బీదరులో, జహీరాబాదులో రెండు జాతీయ వికాస కేంద్రాలు ( యన్. ఇ. యస్. బ్లాకులు ) ఉత్సవ సంరంభాలతో, మహోత్సాహభరితమైన దృశ్యాల మధ్య ప్రారంభింపబడినవి. 17 నెలల పాటు అభివృద్ధి పని జరిగిన తరువాత 1955 ఏప్రిల్ నెలనుంచి ఆ కేంద్రాలను సామాజికాభివృద్ధి బ్లాకులుగా మార్చడమైనది. 1955 ఏప్రిల్ 15 వ తేదీన హుమ్నాబాదులో మరొక యన్.ఇ.యస్. బ్లాకుకు ప్రారంభోత్సవం జరిగింది.

ఇంతగా వెనుక బడివున్న ప్రాంతంలో స్వయం కృషితో అభివృద్ధిని సాధించాలన్న కొత్త భావాన్ని ప్రజలలో వ్యాపింపజేయడం సులభమైన పనికాదు. అయితే భారతదేశమంతటా అసలు జరుగుతున్న ఈ కార్యక్రమంలోని ఒక ప్రత్యేకత ఏమంటే ఇటువంటి అభివృద్ధి పనికి చాలా వెనుకబడివున్న ప్రాంతాలే ఎన్నిక చేయబడుతాయి. ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని ఎన్నిక చేయడానికి ఒక కారణ మున్నది. ఇది పూర్వం జాగీరు ప్రాంతం. చాలా కాలంపాటు నిర్లక్ష్యం చేయబడింది. ఇక్కడ సాంఘిక సదుపాయాలేమీ లేవు. ఇంతగా నిర్లక్ష్యం చేయబడినా ఈ ప్రాంతం అభివృద్ధి పొందడానికి వ్యవసాయ రీత్యా చాలా అవకాశాలున్నవి. కనుక ఇక్కడ అభివృద్ధి కృషి ప్రారంభమయిన దంటే ఈ ప్రాంతంలో నవజీవన రేఖలు ద్యోతకం కాగలవని ఆశింపబడింది. ఈ ఆశ ఎంతవరకు ఈడేరినదీ ఈ క్రిందివివరాలను బట్టి తెలియగలదు:-

## కొత్తబస్తీ

ఇంతకుమునుపు మిర్జాపూరు చాలా చిన్న గ్రామం. 800 జనాభా వుండేది. గ్రామంఅంతా దుమ్ముతో, చూడడానికి అందవిహీనంగా వుండేది. కాని ఇప్పుడు అలా లేదు. మేదరు యస్. ఇ. యస్. బ్లాకుకు ప్రధాన కేంద్రంగా ఎన్నిక చేయబడిన తరువాత ఈ గ్రామం అంతా ఒక కొత్త బస్తీగా పునర్నిర్మించ బడింది. ప్రాజెక్టుఉద్యోగులకు, కార్యకర్తలకు ఉండడానికి కొత్త డిజైనుల భవనాలు, ఒక ఆరుబయలు నాటకశాల, ఒక సమాచార కేంద్రం, కళలు చేతిపరిశ్రమల కేంద్రం, ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం, ఒక విక్రయ కేంద్రం, ఒక పశువుల ఆస్పత్రి, ఒకకృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం, చక్కని ఉద్యానవనం నిర్మింపబడినవి. గ్రామంలో విద్యుద్దీపాలు, నీటి సరఫరా ఏర్పాట్లు, పారిశుధ్య వసతి కలవు. గ్రామం ప్రక్కనే 12 ఎకరాల ఆదర్శ క్షేత్రం కలదు. ఇందులో విత్తనములు చల్లి మొక్కలు పెంచబడుతాయి. ఆ మొక్కలు రైతులకు పంపిణీచేయబడుతాయి. అంతేగాక ఆ క్షేత్రం మేలురకం పద్ధతులవంటి వ్యవసాయ ప్రయోగాలకు కూడా ఉపయోగపడుతున్నది. ఒక కోళ్ళ పెంపకపు పెట్టె కూడా ఏర్పాటు చేయబడింది. దీనివల్ల పరిసర గ్రామాలలో కోళ్ళ పెంపకం విషయమై అభివృద్ధికరమైన పద్ధతులను ప్రచారంచేయడానికి వీలు పడుతున్నది. ఒక కుటీర పరిశ్రమల ప్రదర్శనశాల కూడా కలదు. వ్యవసాయక్షేత్రానికి రెండువైపులా వున్న మల్కాపూరు, మిర్జాపూరు గ్రామాలను రెంటినీ కలుపుతూ కొత్తబస్తీ నిర్మింపబడింది. అందువల్ల గ్రామం పెరగడమే కాక పై రెండు గ్రామాల ప్రజలు ఒకే గ్రామవాసులై అక్కడ కొత్తగా లభింపజేయబడిన సౌకర్యాలను అంతా కలిసికట్టుగా వినియోగించుకోవడానికి వీలు పడుతున్నది.

ఈ **ఆదర్శగ్రామం** నిర్మాణానికి మొత్తం రు. 1,70,000 లు ఖర్చు అయినది. ఈమొత్తం బడ్జెట్‌లో కేటాయింప బడిన మొత్తానికి లోపుగానే ఉన్నది. బ్లాకులోని ఇతర ప్రాంతాలకు నష్టం కలిగే విధంగా వేరేపనులకు కేటాయింపబడిన డబ్బు ఈ గ్రామం నిర్మాణానికి ఏమాత్రం ఉపయోగించ బడలేదు.

ఈ బస్తీని చూడగానే బ్లాకుకు ఇది సరియైన ప్రధాన కేంద్రమని అనిపిస్తుంది. దీన్ని గూర్చి భారత ప్రభుత్వ కమ్యూనిటీ ప్రాజెక్టుల ఎడ్మినిస్ట్రేటర్ (శ్రీ) యస్. కె. డే ఇలా అభిప్రాయమిచ్చారు. "కొత్త ప్రదేశంలో ఇండ్లు నిర్మించి ఆ ప్రాంతాన్ని ఒక బస్తీగా చేయడం ఒక సృజనాత్మకమైన కార్యం. బ్లాకుయొక్క ప్రధాన కేంద్రాన్ని జన సమ్మర్దంగల ప్రాంతానికి దూరంగా ఎత్తైన ప్రదేశంలో నిర్మించాలి. అక్కడినుంచి చూస్తే ఆ బ్లాకులోని పల్లెప్రాంతమంతా చక్కని దృశ్యంలా కన్పించాలి. ఈ విధంగా ఉండడంవల్ల అభివృద్ధి కార్యక్రమంలో పనిచేస్తున్న ఉద్యోగులపై మానసికంగా ఒకవిధమైన ప్రభావం పడుతుంది. అందు మూలకంగా బ్లాకుయొక్క ప్రధాన కేంద్రానికి వెలుపల

జరిగే కార్యక్రమాలలో కూడా తగు విధంగా శుభ సూచకమైన మార్పు వస్తుంది.''

## గృహవసతి

గ్రామసీమలలో చేరగా, అందమైన ఆకర్షణీయమైన ఇండ్లను నిర్మించడం పెద్ద ఆవశ్యకతగా వున్నది. కనుకనే ప్రాజెక్టు ప్రాంతంలో తలపెట్టబడిన కార్యక్రమంలో గృహవసతి అతి ప్రధానమైన అంశమై వున్నది. పాత గ్రామాలు కొన్ని పల్లపు ప్రాంతాలలో ఉన్నాయి. వీటిలో వర్షాకాలంలో మనుష్యులు నివసించడానికి వీలుండదు. ఈ కారణంచేతనే షీవగు ప్లానులోని రాముతీర్థ గ్రామ ప్రజలు, ఔరంగాబాదు ప్లానులోని అసద్‌గంజ్ గ్రామ ప్రజలు తమతమ పాత స్థలాలను వదిలివేయవలసి వచ్చింది. ప్రతి తరగతికి క్రమమైన డిజైనులు సిద్ధ పరచడం, సామగ్రిని ఎన్నిక చేయడం, ఖర్చును సాధ్యమైనంత వరకు తగ్గించుకోవడం మొదలగు విషయాలను గురించి ఆ ప్రజలకు మొదట తెలియ చెప్పవలసి వచ్చింది. ఇలా తెలియజెప్పాలంటే వ్యవసాయదారులు, గ్రామ చేతిపనివారలు మొదలగు వివిధ వర్గాలవారిచే ఆమోదింపబడిన డిజైనుల ప్రకారం నమూనా ఇండ్లు నిర్మించవలసి వున్నది. ఇటువంటి నమూనా ఇండ్లు గ్రామాలలో ముఖ్యంగా తక్కువ ఆదాయపు వర్గాలవారి కొరకు నిర్మింపబడినవి. ఇంతగాక కొత్తగా రెండు గ్రామాలు కట్టబడినవి. వాటిలో ఒక గ్రామంలో 87 ఇండ్లు, మరొక గ్రామంలో 42 ఇండ్లు కలవు. ఇండ్ల స్థలాలు సులభంగానే లభించాయి. ఒకటి రెండు సందర్భాలలో మాత్రం భూమిని స్వాధీన పరచుకోవడానికి కొంత వ్యవహారం జరుపవలసి వచ్చింది. కొంతమంది భూయజమానులు ప్లాట్లను ఉచితంగా ఇచ్చారు. అయితే ఇండ్ల స్థలాలను ఎన్నిక చేయడంలో పల్లపు ప్రాంతాలు, బురద ప్రదేశాలు, వరదలు రాగల ప్రాంతాలు, పట వాలుగా వుండు ప్రాంతాలు, గనులు త్రవ్వబడిన ప్రాంతాలు మున్నగునవి లేకుండ శ్రద్ధవహించడమైనది. స్థల పరిస్థితిని దృష్టియందుంచుకొని ప్రస్తుతమున్న గ్రామాలకు అనుగుణంగానే ఇండ్ల నిర్మాణం జరుపబడింది. ఒక్కొక్క ఎకరంలో 15 మొదలు 20 ఇండ్లు వచ్చేటట్లుగా—అంటే ఎకరం స్థలంలో 75 మొదలు 100 మంది వ్యక్తులు నివసించునట్లుగా ఏర్పాట్లు ఏర్పాటుచేయబడినవి. లభించిన స్థలంలో నూటికి 15 వంతులు రోడ్లు వేయడానికి, 20 వంతులు గ్రామానికి ఖాళీస్థలం కొరకు, 5 వంతులు పబ్లిక్ భవనముల కొరకు మిగిలిన 60 వంతులు నివేశన స్థలాల కొరకు ఉపయోగించ బడింది. ఒక్కొక్క ప్లాటు విస్తీర్ణం 40' × 40'. కొన్ని ప్లాట్లు 40' × 80', 50' × 60' విస్తీర్ణం గలవి కూడా ఉన్నవి. ప్రతి ఇంటికి 576 చ. గజాల స్థలం, రెండు గదులు, ఒక వంటగది (8' × 6'), పొగరాని పొయ్యి, సింక్ ర్యాకులు, 8' × 6' విస్తీర్ణంగల ఒక వరండా, రెండు ద్వారాలు, 40' × 26' విస్తీర్ణంగల పెరడు వుంటాయి.

కాలనీని చూడడానికి ఉత్సుకత పుట్టించనుండా ఉండడానికై 20, 25 ఇండ్ల వరుసకు గృహ ద్వారాలు మార్చబడుతూ ఉంటాయి. బావులు, ద్వారబంధాలు, కిటికీలు, ఎలప గోడలు, కాంపౌండు గోడలు మొదలగునవి గ్రామ పేర్లతో రంగులతో వివిధంగా అలంకరించ బడుతాయి. గ్రామం చూడడానికి అందముగా ఉండుటకై ఇండ్ల వరుసలు, రోడ్లు, సందులు మొదలైనవన్నీ చక్కని సమ్మేళనంతో నిర్మించబడునట్లుగా శ్రద్ధ వహించబడుతుంది.

రాముతీర్థ గ్రామప్రజలకు ఇండ్లకు దేశవాళీ పెంకు ఉపయోగించుకోవలసిందిగా సలహా చెప్ప బడింది. కాని అసద్‌గంజ్‌లో ఎక్కువగా కోతులు ఉండడంచేత తేలికైన సాబాను రాతితో ఇండ్లకు కప్పువేయ బడింది. ఈ రెండు గ్రామాలలో ఇండ్ల యజమానులే నిపుణులుగాని కార్మికులవలె పని చేశారు. తాపీ పనికి తలుపులు, కిటికీలు పైకప్పు వాసాలు మొదలగు వాటికి ప్రాజెక్టుక్రింద గ్రామీణ గృహవసతి ఋణములనుంచి ఇచ్చు సేటా

యించడమైనది. ఇండ్ల నిర్మాణం పనిని, పర్యవేక్షణ బాధ్యతలను ప్రాజెక్టు అధికారులే వహించారు. ఎందుచేతనంటే ఇందువల్ల ఋణం డబ్బును, నిర్మాణ కార్యక్రమానికి సక్రమంగా వినియోగించడానికి వీలుపడుతుంది.

## వ్యవసాయం

ఈ ప్రాంతంలో నూటికి 80 మంది ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం. కనుక వ్యవసాయాభివృద్ధికొరకై బహుముఖ కార్యక్రమం వేయబడింది. భూములకు నీటి సరఫరాకోసం కొత్త బావుల త్రవ్వకం, పాతబావులను మరమ్మతు చేయడం, ఆయిల్ యింజనులు పంపింగ్ సెట్లు సరఫరాచేయడం, పరపతి లభించని వ్యక్తులకు ఋణములివ్వడం, ఆదర్శ వ్యవసాయ క్షేత్రాలు డెమాన్‌స్ట్రేషన్ ప్లాట్లు పర్పాటుచేయడం, మేలు రకం విత్తనాలు రసాయనిక ఎరువులు రైతులకు సప్లయిచేయడం, పొలాలలో కలుపుతీయడం, గుంటలు త్రవ్వి ఎరువు కూడబెట్టడం, రైతుల శిక్షణ తరగతులు నడపడం—ఇవన్నీ ప్రత్యేకంగా చెప్పుకోదగిన కార్యక్రమాలు. వీటివల్ల అనేక సత్ఫలితాలు కలిగినవి.

ఈ ప్రాంతంలో బావుల ద్వారానే భూములకు నీటి సరఫరా పర్పాటు చేయడానికి వీలుపడుతుంది. ఇతర నీటివనరులు లేవు. ఆనకట్టలు కట్టాలని ప్రయత్నాలు చేయబడినవి. కాని అవి ఫలించలేదు. కొత్తబావులుత్రవ్వడానికి రూ 100,000లు పాతబావుల మరమ్మతుకు రూ. 50,000 లు బడ్జెటులో కేటాయించబడినవి. చాలా కొద్ది కాలంలో 300 బావులు త్రవ్వబడినవి. ఇందుకు గ్రామసేవకులు నిర్విరామంగా కృషిచేసి బావుల నిర్మాణం పనిని స్వయంగా పర్యవేక్షించారు. అంటే ఈ నిర్మాణంవల్ల దాదాపు 3000 ఎకరాలకు శాశ్వతంగా నీరు లభించి, 300 కుటుంబాల ఆదాయం హెచ్చుతుంది.

పాతకాలపు 'మోట'కు బదులుగా బీదరు బ్లాకులోని రైతులకు 40 ఆయిల్ ఇంజనులు పంపింగు సెట్లు, జహీరాబాదు బ్లాకులో 59 ఆయిల్ ఇంజనులను సరఫరాచేసి అదనంగా 528 ఎకరాలు సాగుకు తేబడినవి. ఇవి ప్రాజెక్టు నిధులనుంచి తక్కావీపై ఇవ్వబడినవి.

వ్యవసాయ పరపతి సంఘాలను పర్పాటుచేసి రూ. 6,00,000 ల మేరకు స్వల్పకాలిక ఋణములివ్వబడినవి. భూములకు నీరు సరఫరాచేసే బావులను కొత్తగా త్రవ్వడానికీ, పాత బావులను మరమ్మతు చేయడానికి, ఆయిల్ ఇంజనులు మొదలగు వాటిని సరఫరా చేయడానికి రూ. 4,00,000 ల మేరకు దీర్ఘకాలిక ఋణములివ్వబడినవి. కాని ప్రస్తుత తక్కావీ నియమావళి ప్రకారం హామీ ఇవ్వలేక పోయినట్టి ప్రజలు ఈ పథకమువల్ల లాభపడలేక పొయ్యారు. కనుక పరపతిలభించనట్టి అటువంటి వ్యక్తులకు సహాయంచేసే ఉద్దేశంతో దీర్ఘకాలిక ఋణం మొత్తంనుంచి రూ. 70,000ల డబ్బు కేటాయించబడింది. అట్టివారికి ఎద్దులు, గొర్రెలు, గేదెలు, ఆవులు, కోళ్ళు మొదలగు వస్తురూపంలో ఋణములివ్వబడినవి. వాటిని వారు పెంచుతూఉంటారు. అయితే వారుఋణాలను తిరిగి చెల్లించు నంతవరకు అవి ప్రభుత్వ ఆస్తిగా పరిగణించబడుతాయి.

మీర్జాపూరులో నెలకొల్పబడిన ఆదర్శ వ్యవసాయ క్షేత్రంలో మేలురకం వ్యవసాయ పద్ధతులన్నీ ప్రయోగం చేయబడి, పడాదికి రెండుమార్లు అంటే ఖరీఫ్ పంటలో ఒకసారి, రబ్బీపంటలో మరొకసారి, క్షేత్రంలో పైరు ఉన్నప్పుడే రైతులకు చూపబడుతూ ఉంటాయి. రైతుల జాతరలు కూడా జరుపబడుతూ ఉంటాయి. రైతుల ఉత్సవాలు కూడా జరుపబడుతూ ఉంటాయి. సాగుకు అయ్యే ఖర్చు, పంటవల్ల వచ్చే ఆదాయం మొదలగు వివరములను రైతులకు తెలియజెప్పి, వారు కూడా వారి పొలాలలో కొత్త పద్ధతులను అవలంబించవలెనని ప్రోత్సాహ పరచడ మవుతుంది.

మంచి కూరగాయల మొక్కలు, విత్తనాలు, పండ్ల చెట్ల మొక్కలు, అలంకార యోగ్యమైన మొక్కలు వ్యవసాయ క్షేత్రంలో పెంచబడి గ్రామస్థులకు సరఫరా చేయబడుతూ ఉంటాయి ఒక నమూనా ఆటవిక మొక్కల కేంద్రం కూడా కలదు. ఇందులో వివిధ వృక్షజాతుల మొక్కలు పెంచబడుతూ ఉంటాయి.

ఇవేగాక గ్రామసేవకుడుఉండే ప్రతి కేంద్రంలో ఒక ఆదర్శ క్షేత్రం కలదు. అందులో రైతులకు వ్యవసాయవిశేషాలు బోధింపబడుతాయి. ప్రాజెక్టు నిధులనుంచి ప్రతి ఆదర్శ క్షేత్రానికి ఎరువులు, వ్యవసాయ పనిముట్ల రూపంలో రూ 200 ల వరకు సహాయం చేయబడుతుంది. ప్రతి గ్రామసేవ కునికి ఒక గోదాము ఉంటుంది. అందులో రైతు లకు సరఫరా చేయడానికి ఈ క్రింది సరుకులు నిలువ చేయబడుతాయి. అమోనియం సల్ఫేట్. ప్యాడీ ఫెర్టిలైజర్, సూపర్ ఫాస్ఫేట్; జొన్న, గోధుమ, ఆలుగడ్డ, జనుమువిత్తనాలు, గెమాక్సిన్, గంధకం, డస్టర్లు, స్ప్రేయర్లు, నాగళ్ళు.

బీదరుబ్లాకులోని 71 గ్రామాలలోను, జహీరా బాదు బ్లాకులోని 67 గ్రామాలలోను మేలురకం విత్తనాలు, ఎరువులను ఉపయోగించినందువల్ల కలిగే ఫలితాలను రైతులకు చూపెట్టడానికై డెమాన్‌స్ట్రేషన్ ప్లాట్లు (ప్రదర్శన స్థలములు) కలవు. మేలురకంఎరువులు వేయనట్టి 20 గుంటల ప్లాటు మధ్యన వుంటుంది. దానికి రెండువైపుల ఎరువులు వేసిన 20 గుంటల ప్లాట్లు ఉంటాయి. ఆ ప్రాంతంలో పండునటువంటి జొన్న, గోధుమ, చెరకు, ఆలుగడ్డ మొదలగు పైరులు ప్రతి ఋతు వులో మేలురకం ఎరువులతో పండించి, అట్టి ఎరు వులు ఉపయోగించడం వల్ల కలిగే ప్రయోజనం ప్రత్యక్షంగా రైతులకు చూపెట్టడమవుతుంది. పి. డబ్ల్యు 5, పి. డబ్ల్యు 12, పి. డబ్ల్యు 16 గోధుమ మేలిరకం విత్తనాలను, యం—35—1 మేలిరకం జొన్న విత్తనాన్ని ఉపయోగించినట్ల యితే పంటల వ్యత్యాసం ఎలా ఉంటుందో రైతు లకు చూపెట్టడానికై రెండుబ్లాకులలోను డెమాన్‌స్ట్రేషన్ ప్లాట్లు నెలకొల్పబడినవి. మేలురకం విత్త నాలను, ఎరువులను ఉపయోగించినందువల్ల కలిగే ఫలితాలను చూపడానికై గ్రామ సేవకులు రైతు లను తమవెంట తీసుకువెళ్ళుతారు. ముఖ్యంగా పంట కోతల కాలంలో, నూర్పిళ్ళ కాలంలో ఇలా చూపడ మవుతుంది.

బీదరు బ్లాకులో ప్యాడీ మిక్శ్చర్ అమోనియం సల్ఫేట్, సూపర్ ఫాస్ఫేట్ వంటి ఎరువులు 14,516 మణుగులు, జహీరాబాదు బ్లాకులో 9173-5 మణుగులు సరఫరా చేయబడినవి. ఈ ఎరువుల వల్ల కలిగే లాభములను వ్యవసాయ దారులు గ్రహించారు. ఇప్పుడు వీటికి గిరాకీ హెచ్చుగా వున్నది.

నగదు పద్ధతిపైన, తక్కావీ పద్ధతిపైన బీదరు బ్లాకులో 3857 మణుగులు, జహీరాబాదు బ్లాకులో 9895 మణుగులు మేలిరకం విత్తనాలు సరఫరా చేయబడినవి.

ప్రదర్శన పద్ధతి ద్వారా కంపోస్టు ఎరువులవల్ల కలిగే ప్రయోజనాలను ప్రజలకు తెలియజెప్పడ మైనది. బీదరులో 6397 కంపోస్టు గుంటలు, జహీరాబాదులో 7708 గుంటలుకలవు. కంపోస్టు ఎరువు తయారు చేయడానికి ప్రభుత్వ భూమి దొర కని చోట్ల కొందరు వ్యక్తులు తమ పొలాలలో కొంత భాగాన్ని ఇందుకొరకై ఇచ్చారు.

గ్రామాలలో వ్యర్థమైన మొక్కలను, మురికినీ తొలగించడానికై ప్రతి సంవత్సరం సెప్టెంబరులో ప్రత్యేకంగా ఒకరోజు ఆ కార్యక్రమం అమలు జరుపబడుతుంది. గ్రామసేవకుడు గ్రామంలోని యువకులు, రైతులు, స్వచ్ఛంద సేవకుల సహా యంతో గ్రామాలలోను పొలములలోనుగల కలుపు మొక్కలను పెరికి వేస్తాడు. ఈ విధంగా గ్రామం శుభ్రపరచ బడుతుంది. ఆ మొక్కలు కంపోస్టుగుంటలలో వేయబడుతాయి. గ్రామ పంచాయితీవారు కంపోస్టు ఎరువును నగదుసొమ్ము పద్ధతిపై అమ్మివేస్తారు. అట్లా వచ్చిన డబ్బును

ముందు ఇంకా జరుగవలసిన పారిశుధ్యపు పనికీ కంపోస్టు తయారీ పనికీ ఉపయోగిస్తారు. ఈవిధంగా 473 కంపోస్టుగుంటలు తయారుచేయబడినవి.

గ్రామనాయకులకు, ఉద్యోగ బృందానికీ, అన్ని రంగముల అభివృద్ధి పనులలో శాస్త్రీయ, ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికై బీదరు, జహీరాబాదు బ్లాకులలో ఏడాదికొకసారి శిక్షణ తరగతులు నడుప బడుతాయి. ఈ విధంగా శిక్షణపొందిన వ్యక్తులు తాము నేర్చుకున్న విషయాలను గ్రామస్థులకు చెబుతారు. శిక్షణ తరగతిలో కౌల్దారీచట్టం, భూమ్యాదాయ పరిపాలనా విషయములు, తోట పని, సాంఘికవిద్య, వినోదముల ప్రాధాన్యం మొదలగు అంశములు బోధింపబడుతాయి.

## పశువైద్యం

1954 అక్టోబరు 3 వ తేదీన మిర్జాపూరులో ఒక పశువైద్య వికాసకేంద్రం స్థాపించ బడింది. ఈ కేంద్రంలో ఒక ఆసుపత్రి, ఒక కోళ్ళ పెంపక కేంద్రం కలవు. ఇందులోనే 1955 అక్టోబరు 1వ తేదీనుంచి కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం పెట్ట బడింది.

ఆసుపత్రిలో ప్రతిరోజు సగటున 15 మొదలు 25 మందికి చికిత్సచేయడ బడుతోంది. పోలీసు పటేలువద్దనుంచిగాని లేక గ్రామసేవకుని వద్దనుంచి గాని గ్రామంలో ఏదైనా అంటువ్యాధివ్యాపించిందని వర్తమానం రాగానే అక్కడికి వెంటనే సహాయం అందజేయబడుతుంది. రోగనిరోధక టీకాలు వేయబడుతాయి. ఇంతవరకు 9125 పశువులు అంటువ్యాధులనుంచి రక్షింప బడినవి.

గ్రామసేవకులవద్ద పశువుల ఔషధపు పెట్టెలుంటాయి. వారు పశువుల వ్యాధులకు వెంటనే ప్రథమ చికిత్స చేస్తారు. ఇటువంటి మందుల పెట్టెల సంఖ్యను హెచ్చించవలెనని సంకల్పించ బడింది.

అసిస్టెంటు వెటర్నరీ సర్జన్, వెటర్నరీ అసిస్టెంటు లైవ్‌స్టాక్‌మన్ మొదలగు పశువైద్య ఉద్యోగులు గ్రామాలలో పర్యటనచేయు సందర్భంలో పశువులను ఏవిధంగా సంరక్షించుకోవలసిందీ, ఆధునిక పద్ధతి ప్రకారం గిత్తలకు ఎట్లా విత్తులు కొట్టవలసిందీ చెప్పుతారు.

ఈ విధంగా పర్యటన సందర్భాలలోను, ప్రధాన కేంద్రాలలోను 967 గిత్తలకు విత్తులు కొట్టబడినవి. ఏగ్రామంలోనైనా ఒకేపర్యాయం 20 ఎద్దులకు విత్తుల కొట్టవలసి వున్నట్లయితే పశువైద్య ఉద్యోగి అక్కడికివెళ్ళి ఆపని నిర్వహిస్తారు.

స్థానిక పశువులు పొట్టిగాను, చెప్పుకోదగనంతగా ఉండడంచేత వాటిని దియోనీ ఎద్దులను ఉపయోగించి శ్రేష్ఠమైన జాతిగా రూపొందించవలెనని తల పెట్టబడింది. స్థానిక పశువుల స్థితిని అభివృద్ధి పరచడానికై ఇక్కడ ఒక సుదీర్ఘకాయుడా కోడె ఎద్దు ఉంచబడింది. ఈ ఎద్దులవల్ల కలిగే ఫలితాలు పరిశీలింపబడుతున్నవి. నియాల్కల్, జెముల్‌గేడా గ్రామాలలో దియోనీ కోడె ఎద్దులు ఉంచబడినవి. వీటిని ఆయా గ్రామాల పంచాయితీలు పెంచుతూ ఉంటాయి. గ్రామ సేవకులు, పశువైద్య ఉద్యోగులు ఆ గ్రామాలను సందర్శించినప్పుడు వాటిని పర్యవేక్షణ చేస్తూ ఉంటారు.

మిర్జాపూరులో కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రం కొరకై రెండు సుశిక్షితమైన కోడె ఎద్దులు ఉంచ బడినవి. వీనిలో ఒకటి అఖిలభారత పశుప్రదర్శనంలో అన్నిటికంటె మిన్నయైన ఎద్దు అని ప్రకటింప బడిన దానికి పుట్టినది. ఇంతకు పూర్వం ప్రకృతి సహజంగా ఉపయోగించబడుతున్న కోడెకు కృత్రిమ గర్భోత్పత్తి కొరకు శిక్షణ ఇవ్వడమైనది. 1:5 రేటు చొప్పున ఫలవంతంగా చేయడమవుతుంది. ఇట్లు చేయడంవల్ల ప్రతి సేకరణవల్ల 25 ఆవులు లాభపడుతున్నవి.

బీదరు బ్లాకులో నియాల్‌కల్ గ్రామం, జహీరాబాదు బ్లాకులో చిరాగ్‌పల్లి గ్రామం కీవిలేజిస్కీము కొరకై ఎన్నిక చేయబడినవి. ప్రతి గ్రామంలో ఒక స్టాక్‌మన్ నియమింపబడినాడు. అతడు పశువైద్య కార్యకలాపాలలో పాల్గొనడమేగాక, గ్రామంలోని క్లబ్బు, గ్రంథాలయం, నాటకాలు,

జాతరలు, ఉత్సవాలు మొదలగువాటి విషయంలో కూడా గ్రామస్థులకు తోడ్పడుతాడు.

ప్రజలకు దీర్ఘకాలిక ఋణ పద్ధతిపై ఆరువందలు జాతి ఆవుపడ్డలు, దూడలు సరఫరా చేయబడినవి. స్థానిక దేశీ కోళ్ళ స్థాయిని పెంచడానికై గంగ్వార్, జారూరు, రేజంటల్, మర్కాపూరు, మిర్జాపూరు గ్రామాలలో 40 కోళ్ళపుంజులు పంపిణీచేయ బడినవి. కోళ్ళను పెంచగలచుకొన్న వారికి కోడిపిల్లలు ఇవ్వబడుతున్నవి. స్థానిక కోడిపుంజులన్నీ తీసివేయ బడినవి. బట్టాదీ పద్ధతిపై గ్రామస్థులకు కోడిగ్రుడ్లు సంపిణీ చేయబడుతున్నవి. చిన్నగ్రుడ్లు అణా కొక్కటి చొప్పున అమ్మబడుతున్నవి. రెట్టింపు ప్రమాణంగల జాతిగ్రుడ్లు రెండణాల కొకటి చొప్పున అమ్మబడుతాయి. జాతి పశుల ధర ఒక్కొక్కటి రూ. 15 లేక రూ. 16. స్థానిక పశులు ఒక్కొక్కటి రూపాయి లేక రెండు రూపాయల చొప్పున అమ్మబడుతాయి.

రాణీఖేత్ జబ్బును నిరోధించడానికి ఇంత వరకు 1000 టీకాలు వేయబడినవి. కోళ్ళ మశూచి టీకాలు 800 వేయబడినవి.

ఒక గొర్రెల పెంపక కేంద్రాన్ని, ఒక తేనెటీగల పెంపక కేంద్రమును స్థాపించుటకు తలపెట్ట బడింది. వెటర్నరీ అసిస్టెంటు హిమాయత్‌సాగర్‌లో ఎక్స్‌టెన్షన్ ట్రెయినింగ్ కొరకు పంపబడినాడు. పశువైద్య వికాస కేంద్రమును ప్రజలే పూర్తిగా స్వయంగా నిర్వహించుకునేటట్లు చేయవలెనని తలపెట్టబడింది.

## సహకారం

సహకార కార్యక్రమంలో వ్యవసాయ పరపతి సంఘాలను ఏర్పాటు చేయవలెననీ, ప్రస్తుత సంఘాల సభ్యత్వ సంఖ్యను హెచ్చించవలెననీ తల పెట్టబడింది. గ్రామసేవకుడుండే ప్రతి కేంద్రంలో ఒక బహుళార్థ సాధక సంఘమును స్థాపించవలెననీ, ప్రతి గ్రామంలో ఒక వ్యవసాయ సంఘము స్థాపించవలెనని కూడా తలపెట్టబడింది. ఇంతవరకు బీదరు బ్లాకులో 86 పరపతి సంఘాలు, 9 బహుళార్థ సాధక సంఘాలు కలవు. జహీరాబాదు బ్లాకులో 50 వ్యవసాయ పరపతి సంఘాలు, 8 బహుళార్థసాధక సంఘాలు కలవు. ఈ సంఘాల సభ్యత్వాన్ని హెచ్చించి, ప్రతికుటుంబం ఒక సహకార సంఘంలో సభ్యత్వం కలిగి ఉండునట్లుగా చేయవలెనని ప్రయత్నములు సలుపబడుతున్నవి.

తాపీపనివారల కార్మిక సహకార సంఘం నెలకొల్పబడింది. ఈ సంఘం ఏర్పాటు కావడం వల్ల నిర్మాణ కార్యంలో మధ్యవర్తులు తొలగిపోయి, ప్రాజెక్టు పనికి కార్మికులు సులభంగా లభించడమేగాక, కార్మికులు సహకార విధానం క్రిందికి వచ్చుటకు వీలుకలుగుతుంది.

ప్రాజెక్టు నిధులతోను, ప్రజల భాగస్వామ్యం తోను ఈ ప్రాంతంలో ఈ దిగువ పేర్కొనబడిన పనులు చేపట్టబడినవి. పాఠశాల భవనములు, రోడ్లు గ్రామమందిరం, త్రాగే నీటిబావుల నిర్మాణం, చావడీ మరమ్మతు.

ఆయిలు ఇంజనులు గలవారికి మరమ్మతు పనిలో సహాయపడడానికై రెండు బ్లాకులలోను ఆయిల్ ఇంజన్ సర్వీసు సొసైటీ పనిచేస్తున్నది.

## వైద్యం - ప్రజారోగ్యం

మిర్జాపూరులో ఒక ఆసుపత్రి స్థాపించబడింది. అందులో గ్రామస్థులకు ఉచితంగా వైద్య సహాయం చేయబడుతుంది. ఆసుపత్రిలో పనిచేయు మంత్రసాని కేంద్రంలోను, తదితర గ్రామాలలోను ప్రసూతి కేసులను చూస్తూ వుంటుంది. ఆసుపత్రిలో రోజూ వందకేసులకు పైగా చూడబడుతూ ఉంటాయి. 1955 మార్చి నుంచి 1956 ఏప్రిల్ ఆఖరువరకు 53,222 మంది ఆసుపత్రి వెలుపలి రోగులకు చికిత్స చేయడమైనది. ఆసుపత్రిలో ఉన్నటువంటి 462 మంది రోగులు చికిత్స పొందారు. 192 ఆపరేషనులు చేయబడినవి. మంత్రసాని 25 పురిటి కేసులను చూచింది.

రాజెంటల్‌లో ఒక ప్రసూతి కేంద్రం కలదు. అందులో ఇద్దరు మంత్రసానులు పనిచేస్తున్నారు. బీదరు హెల్తు విజిటర్ ఈ కేంద్రమును వారానికి రెండు పర్యాయములు సందర్శించి గర్భిణులను బాలెంతలను చూస్తుంది. ఆమె మంత్రసానులను వెంటబెట్టుకొని పరిసర గ్రామాలకుపోయి స్థానిక మంత్రసానులకు గర్భిణీస్త్రీల ఆరోగ్యమునకు సంబంధించిన విషయములను వివరించి, ఎట్లా ప్రసవం జరిపించవలెనో బోధిస్తుంది.

ఆరోగ్యవిద్యాపథకమునకు చెందిన హెల్తు ఇనస్పెక్టర్ గ్రామాలను ఆరోగ్య పరీక్ష జరుపుతాడు. ఇంటింటికి పోయి ఆరోగ్య విషయాలను గూర్చి ముచ్చటిస్తాడు. సామాజికాభివృద్ధి బ్లాకు యొక్క వైద్య ఆరోగ్య యూనిట్ల అధికారి గ్రామాలలో పర్యటించే సందర్భంలో ఆరోగ్య విషయాలపై ప్రసంగించి గ్రామాల పారిశుధ్య పరిస్థితిని ఎట్లా అభివృద్ధి పరచవచ్చో సూచిస్తాడు.

ప్రతి బ్లాకులో 30 గ్రామాలలో వైద్య ఆరోగ్య కార్యక్రమాలు అమలు జరుగుతున్నవి. వైద్యాధికారి ఆసుపత్రి పనిచూచుకొన్న తరువాత ప్రతిరోజు సాయంత్రం గ్రామాలకు వెళ్ళి, జబ్బుగా ఉన్నవారికి చికిత్సచేసి ఆరోగ్య విషయాలపై ప్రజలకు సలహాలిస్తాడు. ప్రతి గ్రామ సేవకునికి ఒక మందులపెట్టె ఇవ్వబడుతుంది. ఆ పెట్టెతో అతడు 8 లేక 10 గ్రామాలకు చికిత్స చేస్తాడు.

## విద్య

బ్లాకు ప్రాంతంలో తలపెట్టబడిన విద్యా కార్యక్రమంలో ఈ దిగువ అంశములు కలవు. పాఠశాల భవనముల ఏర్పాటు; పాఠశాలల పిల్లల సంఖ్యను హెచ్చించుట; సాధారణ పాఠశాలలను ప్రాతిపదిక పాఠశాలలుగా మార్చుట; వయోజన విద్యా తరగతులు నడుపుట: వయోజనులకు గ్రంథాలయాలు ఏర్పాటు చేయుట; వారం వారం ఉపన్యాసాలు ఏర్పాటుచేయుట, మహిళా మండలుల ద్వారా వయోజన విద్య, చేతిపనుల శిక్షణ తరగతులు నడుపుట, కస్తూర్బా గ్రామసేవక బృందమును స్థాపించుట.

గ్రామములలో మొదట విచారణ జరుపబడగా బ్లాకులోవున్న 100 గ్రామాలకుగాను 61 గ్రామాలలో మాత్రమే పాఠశాలలుండేవి. ఆపాఠశాలలకు సొంత భవనాలులేవు. అద్దె ఇండ్లలో ఉండేవి. ఆఇండ్లలోకి గాలి, వెలుతురు సరిగా వచ్చేవికావు. కనుక 150 గదులతో 30 పాఠశాలల భవనములను నిర్మించుటకు పథకం వేయబడింది. గ్రామస్థులు నగదురూపంలోను, కాయకష్టం రూపంలోను, వస్తురూపంలోను సహాయపడడానికి ఆమోదించారు. కనుక బ్లాకునిధులతోను, జిల్లాబోర్డు వాటాతోను, ప్రజల స్వచ్ఛంద సహకారంతోను ఈ కార్యక్రమం చేపట్టబడింది. ఈ విధంగా బీదరు బ్లాకులో 170 గదులతో 38 పాఠశాల భవనములు, జహీరాబాదు బ్లాకులో 180 గదులతో 40 భవనములు పూర్తిచేయబడినవి.

బ్లాకులోని అన్ని గ్రామాలలో నిర్బంధ విద్యా చట్టమును అమలు పరచడంతో పాఠశాలలకు వెళ్ళే పిల్లలసంఖ్య చాలా హెచ్చింది. స్కాలరుషిప్పుల రూపంలోను; దుస్తులు, పుస్తకాలు పలకలు, పెన్సిళ్ళు మొదలగువాటి రూపంలోను సాంఘిక సేవాశాఖ నిధులనుంచి సహాయం లభించుచుండడంవల్ల ఎక్కువమంది హరిజన బాలురు బాలికలు పాఠశాలలకు వస్తున్నారు.

పాఠశాలల పాఠ్య ప్రణాళికలో వ్యవసాయం చేతిపరిశ్రమల శిక్షణ మొదలగు విషయములను ప్రవేశపెట్టడాన్ని ప్రజలు హర్షించి 1955 నవంబరు 14 వ తేదీన మిర్జాపూరులో బాలల మేలా జరిగిన సందర్భంలో 200 ఎకరాల భూమిని విరాళంగా ఇచ్చారు. కాని అప్పుడు ప్రాతిపదిక విద్యను బోధించు ఉపాధ్యాయులు లభించలేదు. ఇప్పుడు ప్రాతిపదిక విద్య ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చేటందుకై బీదరులో ఒక ట్రయినింగు స్కూలు ప్రారంభింపబడింది. ఇందువల్ల 38 గ్రామాలలో

ప్రాతిపదిక విద్య ప్రారంభించడానికి వీలుపడుతుంది. మీర్జాపూగు, జహీరాబాదు సామాజికాభివృద్ధి బ్లాకులలో గ్రామీణ కళల, చేతిపరిశ్రమల కేంద్రాలు ఏర్పాటుచేసి ఆ కేంద్రాలలో ఉపాధ్యాయులకు శిక్షణఇచ్చి, తద్వారా 20 పాఠశాలల్లో నేతపని ప్రవేశపెట్టబడింది. ఇప్పుడు 800 మంది బాల బాలికలు నేతపని నేర్చుకుంటున్నారు.

వయోజనవిద్యా తరగతులు బీదరులో 88, జహీరాబాదులో 90 నడుపబడు తున్నవి. ఇంత వరకు 6,946 మంది వయోజనులకు శిక్షణ ఇవ్వబడింది. ఉపాధ్యాయునికి రూ. 10 లు అలవెన్సు ఇవ్వబడుతుంది. పలకలు, బలపములు, పుస్తకాలు. నల్లబల్లలు, పటములు కూడా సరఫరా చేయబడుతాయి.

ప్రతి బ్లాకులోను మూడు కేంద్రాలు నెలకొల్పబడి ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వబడుతున్నది. ప్రతి గ్రామంలో ఏడాదికి మూడు వయోజన విద్యా తరగతులు నడుపబడుతాయి. ప్రతి తరగతి మూడు నెలలపాటు నిర్వహించబడుతుంది.

బీదరులో 36 వయోజన గ్రంథాలయములు జహీరాబాదులో 45 వయోజన గ్రంథాలయములు తెరువబడినవి. ఆ గ్రంథాలయములలో హిందీ భాషలోను, ప్రాంతీయ భాషలలోను గ్రంథములు పత్రికలు పాఠకులకు లభిస్తాయి. వీటికయ్యే ఖర్చులో 50 శాతమును ప్రజలే నగదురూపంలోను, పుస్తకాల రూపంలోను ఇచ్చారు. బల్లలు, కుర్చీలు మొదలగు కొయ్య సామగ్రి ప్రాజెక్టు నిధులనుంచి ఏర్పాటు చేయబడుతుంది. వీటికి సరియైన రిజిష్టర్లు లెక్కలు కూడా ఉంచబడుతాయి.

గ్రామ వికాస మండలి తరఫున లేదా పంచాయతీ తరఫున ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశుపోషణ, సహకారం, పారిశుధ్యం, విద్య మున్నగు విషయాలపై ప్రతివారం ఉపన్యాసములు ఏర్పాటు చేయబడుతాయి. ఈ ఉపన్యాసము లివ్వబడు సందర్భంలో చిత్రపటములు, పోస్టర్లు ఛాయాచిత్రాలు ప్రదర్శించి చూపబడుతాయి. గ్రామసేవకులు, గ్రామాలను సందర్శించే తదితర ప్రాజెక్టు అధికారులు ఈ ఉపన్యాసము లిస్తారు.

ఎనిమిది మహిళా మండలులు ప్రారంభింపబడినవి. ఈ మండలులు స్త్రీల కొరకు వయోజన అక్షరాస్యత తరగతులను నడుపుతున్నవి. ఆ తరగతులలో నూలువడకడం, కుట్టుపని నేర్పబడుతాయి.

ఒక గ్రామంలో కస్తూర్బా గ్రామసేవక కేంద్రం స్థాపించ బడింది. ఈ కేంద్రం వయోజన విద్యా తరగతులను, నూలువడకు తరగతులను, బాలికల వ్యాయామ విద్య తరగతులను, ఇంకా ఇతర వైజ్ఞానిక కార్యక్రమములను నిర్వహిస్తూవుంటారు. అంతేకాక పొలాలలో పనులు చేసుకోవడానికి వెళ్ళే స్త్రీల పిల్లలను ఈ కేంద్రంవారు కనిపెట్టుకొని సంరక్షిస్తూ వుంటారు. ఈ కార్యకలాపాలను ఇద్దరు గ్రామ సేవికలు నిర్వహిస్తారు.

గ్రామస్తులకు పూర్వం కంటె ఇప్పుడు ఎక్కువ విరామం, విశ్రాంతి ఉన్నవి గనుక వారికి ఆరోగ్యప్రదమైన వినోద కాలక్షేపములు అవసరం. కనుక బీదరు బ్లాకులో 60 భజన మండలులు, జహీరాబాదు బ్లాకులో 70 మండలులు ఏర్పాటు చేయబడినవి. వాటికి తగు పరికరాలు కూడా సరఫరా చేయబడినవి. ప్రజల వినోదం కొరకై భజనలు, జానపద గేయములు పాటలు, ఏర్పాటు చేయబడినవి. గ్రామాలలో గ్రూపు సమావేశములు జరుగుతూ ఉంటాయి. ఈ సమావేశాలకు గ్రామసేవకులు, సాంఘికవిద్య ఆర్గనైజర్లు హాజరవుతూ ఉంటారు. ఈ సమావేశములవల్ల గ్రామాలలో పని చేసే కార్యకర్తలు తాము ఎదుర్కొనే సమస్యలను బాగా అర్థంచేసుకోగలుగుతారు.

సాంఘిక విద్య ఆర్గనైజర్లు నెలలో 20 రోజుల పాటు గ్రామాలలో పర్యటన చేయవలసివుంటుంది. ఆవిధంగా వారు స్వయంగా పర్యటన చేసినందువల్ల అభివృద్ధి కార్యకలాపాలలో ప్రజల సహకారం బాగా లభించడానికి అవకాశము లేర్పడుతవి.

బ్లాకునిధులనుంచి ఒక ఫిలిం ప్రొజెక్టర్, ఫిల్ములు, యతిణీదీపము సరఫరా చేయబడుతాయి. గ్రామస్తులకు అవసరమైనవిజ్ఞానం అందజేసి వారిని వినోదపరచడానికి ఇది సువ్యాప్తమైన పద్ధతి.

బ్లాకు కేంద్రంలో ఒక ఆరుబయలు నాటకశాల నిర్మింప బడింది. అందులో నాటక సంఘాలవారు నాటకములను, జానపద నృత్యాలను, ఇతర వినోద ప్రదర్శనములను చూపుతారు.

## ఉత్పత్తి - శిక్షణ కేంద్రాలు

స్థానిక చేతి పనివారలకు, ప్రోత్సాహకులకు, ప్రత్యామ్నాయ వృత్తులు అవసరమున్న వారి కోసం సిద్దిపేట, జహీరాబాద్ యన్. ఇ. యస్. బ్లాకులను 1955 ఏప్రిల్‌లో పైప్రదేశాలు మార్పు జరిగిన తరువాత వాటిలో ఉత్పత్తి - శిక్షణ కేంద్రములు తెరువబడినవి. వాణిజ్య పరిశ్రమల శాఖయొక్క సూపరింటెండెంటు గ్రామాలలో ప్రాథమిక విచారణ జరిపిన మీదట వాటిలో వడ్రంగం, కమ్మరిపని, తోళ్ళ ఊనకం, నేతపని, ప్రింటింగు, అద్దకం, మొదలగు పరిశ్రమలను ప్రారంభించవలెనని ప్రతిపాదింపబడింది. ఈ వృత్తులనే ఎన్నిక చేయడానికి కారణమేమంటే ఈ పనులు ఆ ప్రాంతంలో ఇదివరకే వ్యాప్తిలో ఉన్నవి. అంతేగాక ముడి సామగ్రి కూడా బాగా లభిస్తుంది. అక్కడ చేతినిండా పనిలేకుండా ఉన్న వారికి ప్రత్యామ్నాయ పనులు లభించే ఆస్కారం కలుగుతుంది. పై కేంద్రములలో శిక్షణ పొందిన వారిని సభ్యులుగాచేర్చి కొన్ని సహకార సంఘాలను ఏర్పాటుచేయవలెనని కూడా ఈ పథకంలో తలపెట్టబడింది. ఈకార్యక్రమం ''గ్రామీణ కళలు, చేతిపరిశ్రమలు, పరిశ్రమలు'' అను శీర్షిక క్రిందికి వస్తుంది. దీని కొరకు ప్రతి కేంద్రానికి రూ. 1,25,000 లు బడ్జెటులో కేటాయించ బడినవి.

అన్ని వృత్తులకు శిక్షణకాలం ఆరు నెలలు. మొదటినుంచే ఉత్పత్తి ఆరంభమవుతుంది. నిపుణులైనపనివారు ఉత్పత్తిపనిని కొనసాగిస్తూతామువేసే పనిని శిక్షణపొందే అభ్యర్థులకు వివరిస్తూ ఉంటారు. ఈ అభ్యర్థులలో చాలా వరకు తమతమ వృత్తులలో అర్థనైపుణ్యం కలిగి ఉంటారు. అందుచేత కేంద్రంలో నేర్పబడే ఉత్తమ సాంకేతిక పద్ధతుల వల్ల అభ్యర్థులు చాలా లాభపడుతుంటారు.

ప్రతి అభ్యర్థికి నెల 1 కి రూ. 20 ల స్టైపెండు ఇవ్వబడుతుంది. శిక్షణ సమాప్తి అయినతరువాత అతడు తాను నేర్చుకున్న వృత్తిని ప్రారంభించడానికై సహకార సంఘంలో సభ్యుడుగా చేరిన మీదట అతడికి కొంత ఋణం ఇవ్వబడుతుంది. అయితే అతడు శిక్షణకాలం పూర్తికాక మునుపు కేంద్రంనుంచి వెళ్ళిపోననీ, ఆ వృత్తినే జీవనాధారంగా చేసుకుంటాననీ ఒక పత్రమును వ్రాసి ఇవ్వవలెను. అభ్యర్థుల ధరఖాస్తులను గ్రామసేవకులు సిఫారసు చేయవలసి ఉంటుంది. అభ్యర్థులను సెలక్షన్ కమిటీవారు ఇంటర్వ్యూ చేస్తారు. మొదట 16 మంది అభ్యర్థులు ఎన్నికచేయ బడినారు. ఇటీవల కమ్యూనిటీ ప్రాజెక్టుల ఎడ్మినిస్ట్రేటర్ శ్రీ యస్. కె. డే ఈ కేంద్రమును సందర్శించిన తరువాత ఇచటి కార్యక్రమమును సయుక్తికం చేయుటకు నిర్ణయించబడింది. ఇప్పుడు ఒక్క చివరు బ్లాకులో మాత్రం కమ్మరిపని, తోళ్ళ ఊనకం, తోళ్ళ పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుచున్నది. జహీరాబాదు కేంద్రంలో కమ్మరిపనీ, వడ్రంగం, నేతపని, ప్రింటింగు, అద్దకపుపని నేర్పబడుతాయి. ప్రతి శిక్షణ కేంద్రంలో మొత్తం 45 మంది అభ్యర్థులుంటారు.

ఈ కార్యక్రమానికి గ్రామస్థులనుంచి మంచి ప్రోత్సాహం లభిస్తున్నది. కేంద్రములలో తయారుచేయబడు వస్తువులు నాణ్యంగా వుండి బజారు ధరలకంటె చవుకగా ఉంటాయి. అందుచేత వాటికి మంచి గిరాకీ వున్నది. ఈ వస్తువులు బాగా అమ్ముడు పోవడానికై రోడ్ల ప్రక్కల షోరూములు పెట్టబడినవి. వాటిలో ఉత్పత్తి చేయుబడు సరుకులు, వాటి ధరలు ప్రదర్శింపబడు

తాయి. ఈ వస్తువులను స్థానిక పరిపాలనా శాఖలు కూడా కొనడానికి ఉత్సహిస్తున్నాయి.

నేత పరిశ్రమలో నెలకు 125 గజముల వస్త్రం ఉత్పత్తి అవుతుంది. ఇందులో ధోవతులు, తువాళ్ళు, నవారు, జేబురుమాళ్లు, చొక్కా గుడ్డలు తెరగుడ్డలు కలవు. ఇవి రూ. 200 లకు అమ్మ బడుతాయి. రూ. 175 ల తోళ్ళ సరుకులు, రూ. 225 వడ్రంగపు సామగ్రి, రూ. 125 ల కమ్మరిపని సామగ్రి ప్రతినెల తయారు చేయబడు తుంటాయి.

సహకార సంఘాల ఏర్పాటువల్ల ఉత్పత్తి చేయబడు వస్తువుల అమ్మకం త్వరితగతిని జరుగు తుంది. మనహాళ్ళిలో ఒక తోళ్ళ సరుకుల సంఘం ఏర్పాటు చెయ్యబడింది. త్వరలో మిర్జాపూరులో చర్మకార కేంద్రం తెరువబడుతుంది.

బ్లాకు సలహా సంఘాల సిఫారసుల ననుసరించి గ్రామ చేతిపనులవారికి, శిక్షణ ముగించుకొన్న అభ్యర్థులకు మేలురకం పరికరములు ముడిసామగ్రి మున్నగువాటి రూపంలో అప్పులు మంజూరు చేయబడుతాయి.



# * ఉభయనగరముల మునిసిపల్ కార్పొరేషనులు *

[౯ వ పుట తరువాయి]

సబ్సిడైజ్డు ఇండస్ట్రియల్ హౌజింగ్ పథకంక్రింద సీతాఫల్ మండీలో రెండు గదులు గల 225 ఇండ్లు నిర్మింపబడు తున్నవి.

మరి ఆరు గృహనిర్మాణ పథకములు ఇప్పుడు సిద్ధం చేయబడుతున్నవి.

రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన అప్పుతో కార్పొరేషను గరీబ్ నగర్ (బేగంపేట) లో ఒక గదిమాత్రమేగల 63 ఇండ్లను, రెండుగదులు గల 63ఇండ్లను నిర్మిస్తున్నది. ఇదేప్రాంతంలో పట్టణ అభివృద్ధి సంఘం ఏజన్సీద్వారా తక్కువ ఆదాయపు వర్గములవారికి ఒక గృహనిర్మాణ పథకం అమలుజరుప బడుతుంది. ఈ పథకం క్రింద ఒక్కొక్కటి 3 గదులు గల 60 ఇండ్లు, 2 గదులుగల 115 ఇండ్లు, ఒక గదిమాత్రమేగల 46 ఇండ్లు నిర్మింపబడుతాయి.

రాంగోపాల పేటలో ఒక మురికిపేట నిర్మూలింపబడింది. అక్కడ 8 ఇండ్లు కట్టబడినవి.

నగరంలో అనేక సహకారసంఘాలుకూడా గృహనిర్మాణ పథకములను అమలుజరుపుతున్నవి.





వ ర్త చి త్ర ము



స్త్రీలకొరకు ఏర్పాటుచేయబడిన ఆసఫియా సహకార పారిశ్రామిక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ శిక్షణ కేంద్రానికి చంచల్‌గూడాలో 1956 మే 19 వ తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ స్టాల్‌లో డా. రామకృష్ణారావు, కుమారి పద్మజా నాయుడు, ఇతరులు.
(క్రింద) శిక్షణకేంద్రంలో పనిచేస్తున్న స్త్రీలు.





రాయచూరు జిల్లాలో పోలీసుగ్రామమైన ఎక్‌లాస్ పూరులో ముఖ్యమంత్రిని ఎడ్లబండిపై కూర్చొనబెట్టి ఊరేగింపుతీశారు.
(క్రింద) పోలీసుగ్రామంలో జరిగిన బహిరంగసభలో ముఖ్యమంత్రి.





అయిజలో భారత సేవక సమాజ్ శిబిరం: రాష్ట్ర హోంమంత్రి శ్రీ డి. జి. బిందూ అయిజ గ్రామంలో భారత్ సేవక్ సమాజ్ శిబిరాన్ని ప్రారంభించారు.

అయిజ గ్రామంలో భారత్ సేవక్ సమాజ్ శిబిరం: శాసనసభ్యులు శ్రీ పుల్లారెడ్డి ప్రసంగిస్తున్నారు.
[దిగువ] రాష్ట్ర హోంమంత్రితో సంభాషిస్తున్న శ్రీ వి. పుల్లారెడ్డి





ఉయ్యూరు భారత్ సేవక్ సమాజ్ శిబిరాన్ని పరిశీలిస్తున్న ఆంధ్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి.

శిబిర నిర్వాహకులకు రోడ్డు నిర్మాణపనిలో తోడ్పడుతున్న రాష్ట్ర వ్యవసాయశాఖ ఉపమంత్రి శ్రీ అరిగె రామస్వామి.

భూదానోద్యమ జన్మదిన వార్షికోత్సవం 1956 ఏప్రిల్ 18 వ తేదీన హైద్రాబాదులో జరుపబడింది.
ఆ సందర్భంలో రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రసంగించారు.

[దిగువ] ఆ సందర్భంలో మరాట్వాడా కవి శ్రీ తుల్జాపూర్కర్ తాము వ్రాసిన గీతం చదివారు.





కాచీగూడా బాలికల ప్రాథమిక పాఠశాల వార్షికోత్సవం రాష్ట్ర విద్యామంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే అధ్యక్షతన జరిగింది.

సంస్కృత విశ్వపరిషత్తు హైద్రాబాదుశాఖ ఆధ్వర్యాన ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారి అధ్యక్షతక్రింద వాల్మీకి దినోత్సవం జరిగింది. ఆ సందర్భంలో ఆచార్య శ్రీ టి. వీరభద్రుడు ప్రసంగించారు.



# గోండులు - వారి ఆచార వ్యవహారములు

శ్రీ పి. సేతుమాధవరావు, ఐ. ఎ. యస్.
హైద్రాబాదు ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి.

భారత దేశములోగల ఆదిమ వాసులలో గోండులు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. వీరి జనాభా సుమారు ౩౦ లక్ష లుంటుంది. గోండులు మధ్య భారత్, ఒరిస్సా, హైద్రాబాదులలో ఎక్కువగా వ్యాపించి ఉన్నారు. అయితే వీరు ఏక జాతికి చెందినవారు కారు. వివిధ సాంస్కృతిక దశలలో ఇతర కొండజాతుల వారితో సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకొని ఉండడం ఇందుకు కారణమై ఉండవచ్చు. గోండులలోనే ఒక డజను వరకు ఉపతెగలున్నాయి. వీరిలో ముఖ్యమైన తెగకు చెందినవారు మధ్యభారత్, మధ్య ప్రదేశ్‌ల లోని వీర జాతులతో సంబంధాలు ఏర్పరచుకొని వారి ప్రభావానికి లోనయ్యారు. సుమారు ౮ వ శతాబ్దంనుంచి వీరు ఫ్యూడల్ విధానాన్ని అవలంబిస్తూ వచ్చారు. గోండ్‌వానా, అదిలాబాదు, ఒరిస్సాలలోని వివిధ ప్రాంతాలలో గోండుల నాయకులు తమతమ జాతివారిపై పరిపాలన సాగిస్తూ వచ్చారు. ౧౭ వ శతాబ్ది ఆరంభంనుంచి గోండులు సిర్పూరులో చిన్నచిన్న రాజ్యాలు ఏర్పరచు కొన్నట్లు చాందా, నాగపూరు, గఢి మండ్ల వారి రాజధానులుగా ఉండినట్లు మనకు తెలుస్తున్నది. ఈ మూడు రాజ్యాలు కొంతకాలం వరకు స్వతంత్రంగా ఉండినవి. కాని ౧౮ వ శతాబ్దంలో మహారాష్ట్రులు వాటిని ఆక్రమించు కొన్నారు. ౧౬వ శతాబ్దంలో గోండుల రాణియైన దుర్గావతి అక్బరుతో పోరాడి వీరస్వర్గ మలంకరించి నట్లు చరిత్రవల్లతెలుస్తున్నది. రాజపుత్రులు, మరియు మహారాష్ట్రుల ప్రభావానికి లోనయినందువల్ల గోండులు శైవారాధకులైనారు. నేటికి కూడా వీరు భవానీదేవిని పూజిస్తారు.

## గ్రామ దేవాలయాలు

గోండుల నాయకులు మహారాష్ట్రులు, రాజపుత్రులకు లోబడి పోయినప్పటికి, చాలమంది గోండులు నాగరిక ప్రాంతాలకు దూరంగా అడవులలో పూర్వపద్ధతిలోనే నివసిస్తూ వచ్చారు. నగరాలకు, పట్టణాలకు సమీపంలో నివసించువారు మాత్రమే మహాదేవ్, భవానీదేవి దేవాలయాలను దర్శిస్తారు. కాని గ్రామాలలోమాత్రం ఇట్టి పూజా మందిరాలు పెద చాలా అరుదుగా కనిపిస్తుంటి. శతాబ్దాలుగా గోండుల మత విధానంలో దైవ విగ్రహాలకు మానవాకృతి ఉండడం అంత ముఖ్యమైనదిగా లేనట్లు కనిపిస్తున్నది. గ్రామాలలోని గోండుల దేవాలయాలను పెంగాడా అని పిలుస్తారు. వీటిలో దైవ విగ్రహాన్ని బట్టపేలికలతో కప్పుతారు. గోండులు ఈటె, అమ్ములతో కూడిన దేవతను ఒకచోట దాచుతారు. సంవత్సరానికొకసారి దీనిని బయటికి తీసి దేవాలయాలకు తీసుకొనిపోతారు. ఒకరోజు జాతర జరిగిన తరువాత 'సల్లి' అని పిలువబడు అమ్ములను తిరిగీ యథాస్థానాలలో దాచిపెడుతారు. దేవాలయంలో బట్ట పేలికలు మాత్రమే మిగిలి ఉంటాయి. గోండులకు అనేక దేవతల యందు భయ విశ్వాసా లున్నాయి. ఈ దేవతలు సాధారణంగా బాణాల రూపంలో ఉంటాయి. ఋతువులు, నాగలితో దున్నడం, విత్తులు చల్లడం, పంటలు కోయడం మున్నగు

వాటికి దేవతలు అధిపతులుగా ఉంటారని వీరి విశ్వాసం. కొన్ని రోగాలకు దేవతల పేర్లే వుంటాయి.

గోండులు విశేషంగా కొండ ప్రాంతాలలో నివసించేవారు కావడం వల్ల, ఇటీవలి వరకు వీరు కుటుంబ యుక్తంగా ఒక గ్రామంనుంచి మరొక గ్రామంలో నివసిస్తూ అస్థిమితంగా ఉండేవారు. వీరు తీవ్రోత్పత్తి పద్ధతిన వ్యవసాయం చేసేవారు కారు. అడవులను కోసి, కట్టెలు కాల్చి, బూడిదను ఎరువుగా వాడేవారు. ఒకసారి పంటలు తక్కువగా పండితే ఈ ప్రజలు మరొక చోటికి పోయి, అదే పద్ధతిలోనే వ్యవసాయం చేస్తారు. ఈ విధంగా వీరు ఒక చోటినుంచి మరొక చోటికి సంచారం చేసి, అక్కడ ఆవాస మేర్పరచుకొని, ఆ తరువాత దానిని వదలటం, క్రొత్తగా భూమిని సేద్యం చేసి కొంతకాలానికి దానిని విడిచిపెట్టి పోవడం పరిపాటిగా ఉండేది. గోండులు ఆటవిక జాతివారు. దేశదిమ్మరులు. ఎక్కడైనా అడవి మంచిగా కనిపిస్తే దానిని తమ స్వంత ఆస్తిగానే పరిగణించేవారు. యాజమాన్యపు హక్కులంటే ఏమిటో వారికి తెలియవు. వ్యవసాయం వారికి సంవత్సరంలో కొంతకాలం వరకు మాత్రమే జీవనాధారంగా ఉండేది. ఉదర పోషణార్థం కందమూలములను ఆహారంగా ఉపయోగించేవారు.

## తెగల పేర్లు

గోండుల సాంఘిక వ్యవస్థ చాల కట్టుదిట్టంగా ఉంటుంది. వీరి తెగ మూడు ఫ్రాత్రాలు అంటే గోత్రాలుగా విభజింపబడి వున్నది. గోండుల దేవతలు శివుని పట్ల కృతఘ్నులు కావడంవల్ల వారిని శివుడు ఒకగుహలో బంధించివేసినాడనీ, గోండుల ఋషి కుపుర్ లింగో అను నాతడు శివుని గూర్చి తపస్సుచేసి ఆయనను మెప్పించి గోండుల దేవతలను రక్షించినాడనీ గోండుల పురాణగాథ చెబుతున్నది. ఈ విధంగా గుహనుంచి విడుదలచేయబడిన దేవతలు కొన్ని జట్టులుగా విడిపోయారు. వీరి సంతతివారు ప్రత్యేక ఫ్రాత్రీలుగాఏర్పడినారు. ఇవి సర్వేన్‌సాగా, స్వివెన్‌సాగా, సర్వేన్‌సాగా, అదివెన్‌సాగా అను పేర్లతో వ్యవహరింపబడుతున్నవి. ఇవే గోండుల గోత్రాలు. ఉదాహరణానికి సర్వేన్‌సాగా గోత్రానికి చెందిన వ్యక్తి అదే జట్టుకు చెందినవారిని వివాహం చేసుకోడు. ఈ విధంగా గోండులు కొన్ని వర్గాలుగా విభజింపబడి యున్నారు. వీరి తెగలకు సెర్మాకి, తలాండిమంగం, పేకం, చకాపీ మున్నగునవి చాలా పేర్లు గలవు. ఇతర గోత్రాలలో కూడా ఇట్టివే చాలా తెగలు ఉన్నాయి. సాధారణంగా వీటికి జంతువులు, చెట్లపేర్లే ఉంటాయి. ఇట్టి తెగలు సుమారు ౭౩౦ ఉంటాయని చెప్పబడుతున్నది.

## నైతిక జీవితము

గోండుల సంఘ నైతిక వ్యవస్థ చాలా కట్టుదిట్టములతో కూడిఉంది. గోండులు చిదానంద స్వరూపులు. కష్టించి పని చేస్తారు. అడవులు, కొండల ప్రాంతాలలోనే విశేషంగా నివసిస్తారు. స్త్రీలు కూడా పురుషులతో సమానంగా కష్టించి పనిచేయడంవల్ల వారిలో సాంఘిక సమానత్వముంది. వారిలో బాల్య వివాహం ఉండదు. వితంతు వివాహం జరుగుతుంది. దాంపత్య జీవితం సుఖదాయకంగా లేకుంటే ఒకరి కొకరు విడాకులిచ్చుకోవడం సులభంగా జరుగుతుంది. విడాకులిచ్చుకోవడం తప్పనిసరి అయినట్లయితే, భార్య క్రొత్త బంధువులు తన వివాహాని కైనఖర్చులను వాపసు చేయాలని మాత్రమే భర్తకోరుతాడు. స్త్రీ పురుషులకు ఇంత స్వేచ్ఛ ఉండడంవల్లనే వారిలో అవినీతికి తావు ఉండదు. ఇటీవలివరకు బలాత్కారం ద్వారా వివాహాలు జరిగేవి. కానీ ఇప్పుడు ఈవ్యవస్థ లాంఛనంగా మాత్రమే జరుగుతున్నది. సంప్రదింపుల ద్వారా వివాహాలు ఏర్పాటు చేయబడుతాయి. స్త్రీ పురుషులు సమానంగా కష్టించి పనిచేయడం వల్ల గోండుల కుటుంబాలు ఆత్మగౌరవం నిలబెట్టుకొంటాయి. వారిలో బిచ్చమెత్తుకొని జీవించే వారు చాలా అరుదు. వాస్తవంగా

యాచకవృత్తి చాల నీచమైనదిగా తలచబడుతుంది. వారిలో కులభేదాలు లేవు. గోండులలో చాల బీద వారు కూడా తాము తమ నాయకునితో గాని లేక గ్రామ ఆసామీతోగానీ సమానంగా ఉన్నట్లే భావిస్తారు. గోండులలో ఎవరైనా తాము ఇతరులకన్నా గొప్ప అని తలచుకొంటే సాటివారంతా వారిని నిరసిస్తారు.

గోండులలో కులభేదాలు, అస్పృశ్యత, బాల్య వివాహం, నిర్బంధ వితంతు వివాహం, చిన్న పెద్ద అనే తారతమ్యాలు లేవు. విశిష్టమైన గోండుల గ్రామంలో వ్యభిచారం, యాచకవృత్తులు వుండవు. పొరుగు కులాల వారి ఆర్థిక పరిస్థితులతో పోల్చినట్లయితే గోండులు చాల బీదవారే. అయినా వారి నైతిక దృక్పథం చాలా విశిష్టమైనది.

## గోండుల నృత్యములు

గోండులు వివిధ ఋతువులలో పండుగలు, వేడుకలు జరుపుకొంటారు. ఈ సమయాలలో వారు నృత్యములు చేస్తారు. పాటలు పాడుతారు. గోండులు చేసే దండారీ నృత్యం చాలా ప్రసిద్ధికెక్కినది. పంట కోతల సమయాలలో యువతీ యువకులు కలిసి నృత్యములు చేయడం సర్వసాధారణంగాకనిపించే దృశ్యమే. గోండులపాటలు కొన్ని కవిత్వ రీతులలో వున్నవి. వారు నృత్యములలో నగారా, దుందుభి, ఢంకా మున్నగు అనేక వాయిద్యములు ఉపయోగిస్తారు. ఈ సమయంలో వారు ఆభరణాలు కూడా ధరిస్తారు. పేరు దండారీ నృత్యమేగాక గోమేలా పారా నృత్యములుకూడా చేస్తారు. కింగ్రీ, తప్పు, పిప్రీ, బోంగా మున్నగు ఇతర ఢంకాలు కూడా పాడుతారు. ఈ నృత్యములు వారి ఆనందమయ జీవితమును ప్రతిబింబింపజేస్తాయి.

పాటలు వారి పూర్వీకుల పౌరాణిక గాథలను తెలియజేస్తాయి. వీటిని వంశపారంపరగా వచ్చు ప్రధానులు పాడుతారు. ప్రధానుల వర్గంవారు గోండుల వర్గ పుట్టు పూర్వోత్తరాలు, వారిజాతుల నాయికానాయకుల కథలు, గోండుల పాండవుల చరిత్ర ప్రపంచ సృష్టి సంబంధించిన పాటలు కాల గర్భంలో కలిసిపోకుండా కాపాడుతూవస్తున్నారు.

## ప్రపంచ సృష్టి

ప్రపంచ సృష్టి ఎలా జరిగిందో గోండులు చెప్పే కథ వినసొంపుగావుంటుంది. ఈ కథను ముల్లుందు అంటారు. క్లుప్తంగా చెప్పాలంటే కథ ఇది:—

ఆదిలో అంతా శూన్యముగా ఉండింది. అప్పుడు ప్రభు నిరంజన్ జన్మించాడు. అప్పుడు సప్తసముద్రాలు పుట్టినాయి. ఆ తరువాత గాలి పొగ మంచు కలిగాయి. ప్రపంచమంతా జలమయమయింది. ఈ నీటిపైన నాచు పుట్టింది. నీళ్లు నాచు సంపర్కంవల్ల నాలుగు పుష్పాలు పుట్టాయి. తరువాత ఈ పుష్పాలు ఫలాలైనాయి. ఇందులో ఒకటి పొట్ట విచ్చుకొని పోయింది. అందులోనుంచి ఒక దేవ సర్పం బయటికి వచ్చింది. రెండోఫలంనుంచి కామధని కస్తూరి అని పిలువబడు గోవు, మూడోదాని నుంచి నిరాకారుడైన ధుంద్ గురువు, నాల్గోదాని నుంచి మహాశక్తి పుట్టారు. ఈశక్తికి వజ్రపథములు, సువర్ణపాదములు, ముత్యాల నోరు ఉండినవి. ఆమె ఆకాశంలో ఎగిరి ధుంద్ మంద్ గురువు ఉంటున్న కోటకు పోయింది. వారు ఒకరినొకరు చూచుకొన్నారు. అప్పుడు మహాశక్తి గర్భందాల్చింది. ఆమె ఇన్నర గజాల పొడుగుగల గ్రుడ్డు ఒకటి పెట్టింది. గ్రుడ్డు పగిలింది. అందులో నుంచి వాయుదేవుడు పుట్టి ఉపరిభాగాన్ని గాలితో పైకి పీయగొట్టినాడు. ఇందులోనుంచి ఏడు స్వర్గాలు పుట్టినాయి. అప్పుడు ధోరగిరి పర్వతం పుట్టింది. ఈ పర్వత సింహాసనంపై యవధానగురువు ఆసీనుడైనాడు. ఆయన పన్నిద్దరు భాస్కరుల ప్రకాశముతో సమానమైన యజ్ఞోపవీతము, పంద్రెండు చంద్రులతో చేయబడినదుస్తులు ధరించినాడు. ఆయన కన్నులు ఇ నక్షత్రములు నాలుగు దీపములతో రూపొందినవి. ఈ సమయంలో ఈ గ్రుడ్డునుంచి తొమ్మిదికోట్ల దేవతలు పుట్టినారు. ఈ లోపల నీరు ధోరగిరికి ప్రమాదం

కలుగునట్లు క్రమేణా పొంగినవి. దేవతలలో కనిష్ఠమైన దేవత మఘు. భూమి పునాదులు ఎంత లోతులో ఉన్నాయో కనుగొనవలసిందిగా ఆయన పంపబడినాడు. ఆయన అనేక అష్టంగులను ఎదుర్కొని పథాలా అను పాతాళలోకమునకు వచ్చినాడు. నిరంజన గురువు ఆశీర్వాద బలంతో ఆకాశంలో ఐదు లింగములు ప్రకాశిస్తున్నట్లు మఘు చూచినాడు. పథాల అఘుగును చూడగలిగినాడు. గురువు పార్వతీ మఘులకు వివాహం చేసినాడు. వివాహమహోత్సవానికి దేవ సర్పం పందిరి వేసింది. భగవంత్ అను దేవుడు ఆభరణాలు, బిచ్చపుసత్తు గొనే సంచి, పాదరక్షలు, 2 దేవజాతి వృషభములు, 2 భిక్షపాత్రలు ఇచ్చాడు. ఆయన మఘుకు బంగారు గుండె, వెండిబెత్తం, జననమరణముల పుస్తకములు కూడా ఇచ్చినాడు. మఘుకు బంగారు జీనుతోపాటు నంది కూడా వప్పగించబడింది. వీటినంతా వెంట తీసుకొని వధూవరులు పాతాళలోకంనుంచి ప్రపంచానికి వచ్చారు. వారు ధోరగిరిలో ఆవాస మేర్పరచుకొన్నారు. అక్కడ వారికి తొమ్మిదికోట్ల దేవతలు అభివందనం చేశారు. అప్పుడు శివుడు ప్రపంచాన్ని సృష్టించాడు. గుమ్మడి విత్తనాలను నాటినాడు. ఇది పక్వమైన తరువాత ఇందులోనుంచి స్త్రీ, పురుషుడు పుట్టినాడు. ఆ పురుషుడు స్త్రీని తన సోదరిగా భావించాడు. మహాదేవుడు అప్పుడు వారికి భ్రాంతిని కలిగించాడు అప్పుడు పురుషుడు స్త్రీని తన భార్యగా పరిగణించాడు. మహాదేవుడు వారికి 'నేను ప్రపంచాన్ని సృష్టించాను. కృషిచేసి జీవించండి' అని ఎద్దును ఇచ్చి దానినుంచి పని తీసుకోండని చెప్పాడు. నిర్ణీత జీవితానంతరం మనుష్యులు మహాదేవుని ఆవాసస్థలానికి పోతూవుండిరి ఆ కాలంలో మృత్యువు అనేది లేకుండింది. కానీ మనుష్యులు ఒకసారి మహాదేవుని మోసంచేశారు. అప్పటినుండి యముడు వారిప్రాణాలను తీసుకొనిపోనారంభించాడు. ఇదే గోండుల ప్రపంచసృష్టికథ.

గోండుల దేవతలు కంకల్కాళికి పుట్టారు. వీరు పుట్టినవెమ్మట ఆమె వారిని విడిచిపెట్టింది. పార్వతీ దేవి వారిని పోషించింది. కానీ వారు కృతఘ్నులుగా ప్రవర్తించినందువల్ల వారందరూ ఒక గుహలోకి త్రోసివేయబడినారు. ఆ తరువాత లింగో అనునాతడు వారిని రక్షించాడు. గోండులకు ఆది పురుషులు ఈ దేవతలే.

గోండుల పురాణంలో మహాభారత కథలు కూడా వున్నాయి. కానీ మహాభారతాన్ని అనుసరించి ఉన్నవి కావు. గోండు దండారీ నటకులు అనేక దేవతల సముఖంలో తమ నృత్యములను ప్రదర్శించి వున్నట్లు ఒక కథ వుంది. గోండుల పురాణంలో చెప్పబడుతున్న మహాదేవుని పాత్ర గొప్పది. ఆయన ప్రపంచాన్ని సృష్టించాడు. పార్వతిని వివాహం చేసుకొన్నాడు. మనుష్యులకు ప్రాణం పోసినాడు. సూర్య చంద్రులను, నక్షత్రాలను సృష్టించాడు. వెల్లువికి వస్తున్న నీటినుంచి అండపిండ బ్రహ్మాండాన్ని, మృత్యు దేవతను సృష్టించాడు. గోండుల దేవుడు ఉత్సాహవంతుడైన గోసాయిగా కనిపిస్తాడు. గోండులను పరీక్షిస్తున్నట్లు వారి కష్టనిష్ఠూరాలనుచూసి వారికి సహాయపడుతున్నట్లు, ప్రపంచం ఏ విధంగా నడుస్తున్నదో తెలుసుకొనుటకు అప్పుడప్పుడు పర్యటనలు చేస్తున్నట్లు మనకు ఆయన కనిపిస్తాడు. స్వయంభువుడు, జగద్రక్షకుడైన దేవుని చిత్రమిది. అయితే సృష్టిలయ కారకుడైన దేవుడు సంసారి జీవితం గడుపుతూ ప్రజల కష్టసుఖాలను పంచుకొంటున్నట్లు మనకు కనిపిస్తున్నది. ఈ విధంగా భగవంతుని చిత్రించడం నిరాడంబరులు, సదానందమూర్తులైన గోండులకే తగును.

# ★ భారత సేవాశ్రమ సంఘం

౧౯౧౭ వ సంవత్సరంలో ఆచార్య స్వామీ ప్రణవానంద్‌జీ మహారాజ్‌గారిచే స్థాపించబడిన భారత సేవాశ్రమ సంఘం సాంస్కృతిక కార్యకలాపాలలోనూ, మానవ సేవలలోను నిమగ్నమై ఉన్నది. ఈ సంఘం యొక్క కేంద్ర కార్యస్థానం కలకత్తాలో ఉన్నది. భారతదేశ మంతటనూ, తూర్పు ఆఫ్రికాలోనూ, దక్షిణ అమెరికాలోను ఈ సంఘానికి శాఖలు కలవు. వరదలు, కరువు కాటకాలు, తుఫానులు, భూకంపాలు, అంటువ్యాధులు మొదలగు దైవిక దుర్ఘటనలు సంభవించినప్పుడు ఈ సంఘంవారు ప్రశంసనీయమైన సేవలుచేసి జాతీయ నాయకుల మన్ననలు పొందారు.

ఈ సంఘానికి భారతదేశంలోని వివిధరాష్ట్రాలలో వెయ్యి గ్రామ ఐక్య కేంద్రాలున్నవి. వీటినే మిలాన్ మందిరాలు అంటారు. ఈ సంఘం అనేక మఠాలను, ఆశ్రమాలను నెలకొల్పింది. వీటిలో మానవసేవ చెయ్యడంకొరకు సన్యాసులకు శిక్షణ ఇవ్వబడుతుంది.,

ఈ సంఘానికి చెందిన సాధువుల జట్లు ఎనిమిది ఇంకా అనేకమంది మతప్రచారకులు ప్రస్తుతం ప్రపంచంలోని వివిధప్రాంతాలలో సాంఘిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక ప్రచారంలో నిమగ్నులై ఉన్నారు. ప్రస్తుతం దక్షిణ ఆఫ్రికాలో వీరి తాలూకు ఒక మత ప్రచారక బృందం పర్యటిస్తున్నది. కుంభ్‌లోనూ, భారత దేశంలో ప్రతి ఏటా తిరునాళ్ళు జరిగే కొన్ని ఇతర



*హైదరాబాదులో 21–5–1956 తేదీన భారత సేవాశ్రమ సంఘం శాఖకు ప్రారంభోత్సవం సల్పుతున్న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బి. రామకృష్ణారావుగారు.*



*ప్రారంభోత్సవం తరువాత ముఖ్యమంత్రి ప్రసంగించారు.*

పవిత్రస్థలాలలోను ఈ సంఘంవారు సహాయకచర్యలు గైకొంటున్నారు. గయ, కలకత్తా, బంకూరా మొదలగు ఇతర ప్రాంతాలలో ఈ సంఘం వారిచే విద్యార్థి గృహాలు నడుపబడుతున్నాయి. వీరు నూరు ప్రాథమిక పాఠశాలలను రాత్రి పాఠశాలలను కూడా నడుపుతున్నారు. ఈ సంఘానికి చెందిన దాదాపు అన్ని ముఖ్య కేంద్రాలలోనూ గ్రంథాలయాలు వున్నాయి.

పవిత్రమైన యాత్రాస్థలాలను సంస్కరించడం ఈ సంఘంవారి ముఖ్యాశయాలలో ఒకటి. యాత్రికులు యాత్రాస్థలాలలో మత విషయికమైనసాంప్రదాయాలను నెరవేర్చడంలో సహాయపడడానికి, పవిత్ర స్థలాలలో ఆధ్యాత్మిక వాతావరణాన్ని కల్పించడానికి ఈ సంఘం వారు గయ, కాశీ, పూరీ, అలహాబాదు, బృందావన్, కురుక్షేత్రాలలో తమ కేంద్రాలను, యాత్రిక నివాసాలను నెలకొల్పారు. ఈ సంఘం యొక్క పెక్కు కేంద్రాలలో వ్యాయామశాలలు మొదలగునవి కూడా వున్నాయి. ఈ సంఘంవారు వివిధ భాషలలో అనేక పుస్తకాలను ప్రచురించడంతోపాటు రెండు మాసపత్రికలు కూడా ప్రచురిస్తున్నారు.

ఈ సంఘానికి సంవత్సరానికి సగటున దాదాపు రూ. ౭ లక్షలు ఖర్చవుతుంది.

హైదరాబాదులోని దోమల్‌గూడాలో భారత సేవాశ్రమ సంఘం యొక్క శాఖను తెరిచే ఉద్దేశంతో ప్రస్తుతం ఈ సంఘంవారు బాలలకొరకు ఒక చికిత్సాలయాన్నీ, పాల కాంటీన్‌ను నడుపుతున్నారు. ఒక విద్యార్థి గృహాన్నీ (గురుకుల్), ఉచిత పఠనాలయాన్నీ, వెనుకబడిన తరగతులు, కొండజాతులవారి కొరకు ఉద్ధరణ కేంద్రాన్ని తెరవడానికి ఈ సంఘం ఉద్దేశిస్తున్నది.

## ముఖ్యమంత్రి విజ్ఞప్తి

౧౯౫౬ మే ౨౧ వ తేదీన పెక్కుమంది ఆహూతుల సమక్షంలో ఈ సంఘంయొక్క శాఖను ప్రారం

పిస్తూ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బి. రామకృష్ణారావు గారు ఈ విధంగా ప్రసంగించారు.

"మన సామాజిక, సాంస్కృతిక వికాసానికై ఒకప్పుడు భారతీయ సాధువులు ముఖ్యాతిముఖ్యమైన పాత్ర వహించారు. వారి సేవలు కేవలం ఆధ్యాత్మిక రంగంవరకు మాత్రమే పరిమితం కాకుండా బహుళ మైనవిగా వుండేవి. ఆకాలంలో పాలకవర్గంవారు ఇట్టి మహర్షులచే సిద్ధం చేయబడిన నైతిక నిబంధనలను ప్రవేశపెట్టి శాంతి భద్రతలను పరిరక్షించడం తప్ప మరేమీ బాధ్యత వహించేవారు కారు. కాని తర్వాత తర్వాత సాధువులు 'మాయావాదం' పేరిట కొన్ని దోష భూయిష్టమైన చేష్టలను అలవరచుకున్నారు. ప్రపంచం కేవలం ఒక కల అనీ, మానవుడు శాంతిని పొందడానికై ఈ విశ్వంనుంచి నిష్క్రమించాలనీ ఈ వాదం బోధిస్తుంది. సాధువులు ఈ విధంగా సమాజంపట్ల తమకుగల బాధ్యతలను తప్పించుకున్నప్పుడు పాలకవర్గానిదే పై చెయ్యి అయినది. చాలా బాధ్యతలను పాలకవర్గంవారే వహించ మొదలు




భారత సేవాశ్రమ సంఘంయొక్క ఉచిత పాల పంపిణీకేంద్రానికి 22-5-1956 తేదీన హైదరాబాదు నగరంలోని దోమల్‌గూడాలో రాష్ట్ర సాంఘిక సేవా శాఖ ఉపమంత్రి ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో ఉపమంత్రి శ్రీ శంకర్‌దేవ్ విద్యాలంకార్, భారత సేవాశ్రమ సంఘం కార్యదర్శి స్వామి శ్రీ అద్వైతానందజీ గారలు.

పెట్టారు. అయితే ప్రపంచంలోని నేటి ప్రభుత్వాలు కొద్దో గొప్పో మత ప్రసక్తి లేని ప్రభుత్వాల కోవకు చెందినవి. ఆ కారణం చేత ప్రపంచాన్ని భౌతికవాద మనే ఒక కొత్త సమస్య ఎదుర్కొన్నది. ఆ వాదం ప్రపంచ శాంతినీ, ప్రపంచ సురక్షితత్వాన్నే బెదిరిస్తున్నది. కనుక సాధువులు, ఋషులు, ఆధ్యాత్మిక వేత్తలు మళ్ళీ ముందుకు రావలెననే పిలుపు వినవస్తున్నది. ఈ విధంగా వారు ముందుకు వస్తేనే మానవజాతికి మంచి భవిష్యత్తు ఉంటుంది. ఈ కారణంచేతనే ప్రపంచ పరిరక్షకుడైనబుద్ధుడు ఈనాడు మళ్లీ ఇంతగా స్మరింపబడుతున్నాడు. ఆధ్యాత్మికంగా ఒక గొప్ప సంస్థ అయిన భారత సేవాశ్రమ సంఘమునకుచెందిన ఈ సాధుపుంగవుల వల్ల హైద్రాబాదు రాష్ట్ర ప్రజలకు ఒక నూత్న జ్యోతికాంతి రానున్నదని చెప్పుటకు నేను సంతసిస్తున్నాను. ఈ సంఘం విస్తారంగా మానవసేవ చేస్తున్న సంస్థ. గతంలో జీవకారుణ్య దృష్ట్యా, ఆధ్యాత్మిక రీత్యా వీరు చేసిన సేవ గణనీయమైనది. ఈ కేంద్రానికి ప్రారంభోత్సవం చేస్తూ మన మాతృభూమికి చెందిన ఈ పవిత్రసేవకులకు రాష్ట్రం తరపున స్వాగతం చెప్పి, ప్రజలుకూడా అన్నివిధముల వారితోసహకరించవలసిందిగానేనువిజ్ఞప్తిచేస్తున్నాను."

తరువాత సేవాశ్రమ సంఘం కార్యదర్శి స్వామీ శ్రీ అద్వైతానందజీ సంఘం యొక్క ఆశయాలను, ఆదర్శాలనుపేర్కొంటూ ఇల్లా అన్నారు:— "నేడు చాలామంది సాధువులు సమాజం పట్ల తమకు గల బాధ్యతలను అలక్ష్యం చేస్తుండవచ్చును. కాని భారత మాత తాను రాజకీయంగా దాస్యంలో వున్న సుదీర్ఘ కాలంలోకూడా మహాఋషులను సృష్టించడం మరువ లేదని మనం గుర్తుంచుకోవాలి. మధ్య యుగంలో మనదేశాన్ని రక్షించడానికి గురు నానక్, శ్రీ చైతన్య, రామదాసువంటి మహాపురుషులు జన్మించారు.

బ్రిటిషువారి పరిపాలనా హయాములో రామకృష్ణ, వివేకానంద, అరవిందుడు, గాంధీవంటివారు మన సాంస్కృతిక జ్యోతిని వెలుగొందజేయడమే గాక తమ మాతృభూమిని దాస్య శృంఖలాలనుంచి విముక్తి పరచి ప్రాచీన ఔన్నత్యాన్ని తిరిగి పొందడానికి తోటి భారతీయులను పురికొల్పారు. ఆచార్య స్వామీ ప్రణవానందజీచే స్థాపింపబడిన భారత సేవాశ్రమ సంఘం యొక్క పెక్కుమంది సభ్యులు క్రమబద్ధమైన కార్యక్రమం ద్వారా పటిష్టమైన ఆధ్యాత్మిక ప్రాతిపదికపై భారతీయ సంస్కృతిని పునరుద్ధరించడానికీ, మానవ జాతినీ, భారతజాతినీ పునర్నిర్మించడానికి సహాయపడ డానికి కృషి చేస్తున్నారు. ప్రస్తుతం సేవాశ్రమ సంఘం యొక్క ఈ శాఖ నైతిక మరియు ఆధ్యాత్మిక ప్రచారంతో పాటు మానవసేవలకు పాటుపడగలదు."

సభా కార్యక్రమానికి ముందు అడ్వొకేటు శ్రీ కె. తాతాచారిగారు ముఖ్యమంత్రిగారికి స్వాగతంచెప్పారు. సికింద్రాబాదు మాజీ మేయరు శ్రీ వాసుదేవ మొదల్యార్ గారు వందన సమర్పణం చేశారు.

ఈ సంఘం తన కార్యకలాపాలను ఆరంభించడం కొరకు దోమల్ గూడాలో మహంత్ బాబా పురందాస్ కొంత స్థలాన్ని విరాళంగా ఇచ్చారు. ఈ శాఖ విజయాన్నికాంక్షిస్తూ డా. ఎస్. రాధాకృష్ణన్, డా. పట్టాభి సీతారామయ్య, శ్రీ కె. యం. మున్షీ, శ్రీ కె. హనుమంతయ్య, శ్రీ పి. కుమారస్వామిరాజా ప్రభృతులు సందేశాలు పంపారు.

## పాల పంపిణీ కేంద్రం

రాష్ట్ర సాంఘిక సేవ ఉపమంత్రి శ్రీ శంకరదేవ్ విద్యాలంకార్ గారు ౧౯౫౬ మే ౨౨వ తేదీన దోమల్ గూడాలో భారత సేవాశ్రమ సంఘానికి చెందిన ఉచిత పాల పంపిణీ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు.

పాలకొరకు ౩౦౦ మందికి పైగా బీదవారు, అనాథ బాలలు వచ్చారు. వారికి పాలనుపంచుతూ ఉపమంత్రి గారు భారత సేవాశ్రమ సంఘంవారు హైద్రాబాదులో తమ శాఖను తెరవడం ద్వారా ఇక్కడి ప్రజలకు మేలు చేకూర్చినవారైనారని అన్నారు. ఈ సంఘం యొక్క సభ్యులైన సన్యాసులు ఉచితంగా క్షీరాన్ని పంచడమే కాకుండా ఈనాడు ప్రజలకు ఎంతో అవసరమైన వైజ్ఞానిక, ఆధ్యాత్మిక బోధకూడా చేస్తారు.

స్వామీ శ్రీ అద్వైతానందజీ ఇంకా కొందరు స్థానికనాయకులు మంత్రిగారికి స్వాగతం చెప్పారు.

# మరాట్వాడా ప్రాంత అభివృద్ధి



రాష్ట్రంలోని తెలంగాణా కర్నాటక ప్రాంతాలకు చేయబడిన కేటాయింపులను తగువిధంగా సర్దుబాటు చేసిన ఫలితంగా హైద్రాబాదు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మరాట్వాడా ప్రాంతానికి జరిగిన కేటాయింపు రూ. ౨౫.౬ కోట్ల వరకు పెంచబడింది.

మరాట్వాడాభూమి విస్తృతంగా నీటి పారుదలకు యోగ్యమైనది కాదు. కాని వర్షాలు లేకపోవడం చేత బావుల ద్వారా నీటి పారుదల వసర్లు ఏర్పాటుచేయడం ముఖ్యంగా తోట పంటలకు అవసరమవుతున్నది. బీడ్, ఔరంగాబాదు జిల్లాలలోని కొన్ని ప్రాంతాలలో ఇన్‌ఫిల్ట్రేషన్ గ్యాలరీలు వున్నాయి. ఆ గ్యాలరీలకు నీటిని నిలువచేసే బావులు, ఆ బావులనుంచి నీటిని గొనిపొయ్యే కాలువలు కూడా ఉన్నవి.

బీడ్ జిల్లాలో ౧౯౩౯ లో నిర్మించబడిన రూటీ ప్రాజెక్టు మరాట్వాడా ప్రాంతానికి మొట్టమొదటి నీటి పారుదల ప్రాజెక్టు అని చెప్పవలెను. దీనికి తోడుగా కరువు కాటకాలు సంభవించెడి కాలంలో సహాయక చర్యలు కూడా గైకొనబడుతున్నవి.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ౪౨ లక్షల ఎకరాలను సాగుచేయగల ౧౦ మధ్యరకం నీటి వనరుల ప్రాజెక్టులు చేర్చబడినవి. వీటినిర్మాణానికి రూ. ౨౧౬ లక్షలు వ్యయం కాగలదని అంచనా వేయబడింది. వీటిలో నాలుగు ఔరంగాబాదు జిల్లాలోను, మూడు బీడ్ జిల్లాలోను, రెండు ఉస్మానాబాదు జిల్లాలోను, ఒకటి నాందేడుజిల్లాలోను వున్నాయి. బీడ్ జిల్లాలోని బెందుసురా ప్రాజెక్టు, ఉస్మానాబాదు జిల్లాలోని ఖాసాపూర్ ప్రాజెక్టు దాదాపు పూర్తి అయినాయి. వాటిక్రింద నీటి పారుదల కూడా ఆరంభమైంది. కాగ్లి, తల్వార్, సిరాలా, శివానా ప్రాజెక్టుల పని చురుకుగా కొనసాగుతున్నది. ఇంకా ఇతరనాలుగు ప్రాజెక్టులైన జై, ధేకూ, నల్‌దుర్గ్, పూర్ణా ఆనకట్టల పని ఇంతవరకూ ఆరంభించ బడలేదు.

ఇక ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మరాట్వాడా కొరకు ౫౪ లక్షల ఎకరాలను సాగుచేయగల పదహారు మధ్యరకం నీటి వనరుల ప్రాజెక్టులు తలపెట్టబడినవి. వీటి నిర్మాణానికి రూ. ౩౫౪ లక్షల వ్యయం కాగలదని అంచనా వేయబడింది. వీటితో ౬ ప్రాజెక్టులు బీడ్ జిల్లాలోను, ౪ ఉస్మానాబాదు జిల్లాలోను, ౫ ఔరంగాబాదు జిల్లాలోను, ౧ నాందేడు జిల్లాలోను వున్నాయి.

తెలంగాణాలో అమలుపరచ దలచిన ౫ మధ్యరకం నీటి వనరుల పథకాలు, కర్నాటక ప్రాంతంలో అమలుపరచ దలచిన ౩ మధ్యరకం నీటి వనరుల పథకాలు విరమించబడినవి. వీటి కొరకు కేటాయించబడిన రూ. ౧౧౬ లక్షల మొత్తం మరాట్వాడాకు కేటాయించబడింది.

ద్వితీయ ప్రణాళికలో ఇతర కేటాయింపులు ఇవి: గృహపరిశ్రమల పద్దు క్రింద తెలంగాణా కొరకు కేటాయించబడిన రూ. ౬౫ లక్షల మొత్తం మరాట్వాడాకు మార్చబడింది. మొదట మరాట్వాడాకు ఈ పద్దు క్రింద రూ. ౪౯ లక్షల మొత్తం మాత్రమే కేటాయించబడింది.

ఆయిల్ ఇంజనుల పద్దు క్రింద మరాట్వాడాకు కేటాయించబడిన మొత్తం రూ. ౩.౫౭ లక్షల వరకు పెంచబడింది. అదే విధంగా మెడికల్ స్టోర్స్ పద్దు క్రింద కేటాయింపు మొత్తం రూ. ౫ లక్షల వరకు పెంచబడింది. ఈ ప్రాంతంలో కట్టుబడి వేసే పనుల కొరకు కేటాయించ బడిన మొత్తం రూ. ౨౦ లక్షల వరకు పెంచబడింది. వైద్య కళాశాల కొరకు, వ్యవసాయ పాఠశాలను వ్యవసాయ కళాశాలగా మార్చడానికి ఉద్దేశింపబడిన రూ. ౨౦ లక్షలు, రూ. ౧౦ లక్షలు గాక, విశ్వవిద్యాలయ విద్యకొరకు మరొక రూ. ౨౯ లక్షలు కేటాయించబడినవి.



# రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషన్



హైద్రాబాదు రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషన్ పనిచేయ మొదలిడిన రెండవ సంవత్సరంలో అంటే ౧౯౫౪—౧౯౫౫ లో అప్పుల కొరకు మొదటి సంవత్సరంకంటె తక్కువగా దరఖాస్తులు వచ్చాయి. రెండవ వార్షిక నివేదికను బట్టి గత సంవత్సరం రూ. ౯౫,౧౫,౫౦౦ ల అప్పుకొరకు ౩౮ దరఖాస్తులు రాగా ఈ సంవత్సరం రూ. ౩౧,౯౦,౦౦౦ ల అప్పు కొరకు ౨౩ దరఖాస్తులు వచ్చినట్లు తెలుస్తున్నది. ఈ సంవత్సరం వచ్చిన దరఖాస్తులలో ౯ దరఖాస్తులకు రూ. ౪,౫౮,౦౦౦ లు మంజూరు చేయబడినవి. ౧౧ దరఖాస్తులు నిరాకరించబడినవి.

ఈ విధంగా మంజూరు చేయబడిన దరఖాస్తులలో ౨ నూనె గానుగ పరిశ్రమలకు చెందినవి. ౩ లైట్ ఇంజనీరింగుకు చెందినవి. ౨ వస్త్ర మిల్లులకు చెందినవి. ఒకటి బియ్యం పిండిమరకు చెందినది. ఒకటి రసాయన పదార్థములకు చెందినవీ కలవు.

మొదటి సంవత్సరంలో కార్పొరేషను ఒక వస్త్రముల మిల్లు యొక్క మొదటి తనఖా డిబెంచర్లు ౬ శాతం వడ్డీ కలవి రూ. ౧౦ లక్షలకు కొనదలచుకొన్నది. కాని రూ. ౬ లక్షల వరకు మాత్రమే కొనడం జరిగింది. ఈ సంవత్సరం మిగిలిన మూడు లక్షల రూ. లకు కూడా ఆ డిబెంచర్లు తీసుకోవడమైనది.

ఈ రెండు సంవత్సరాలలో మంజూరు చేయబడిన మొత్తంలో ౧౯౫౫ మార్చి మాసాంతం నాటికి రూ. ౨౫,౧౩,౯౨౩-౮-౫ ల మొత్తం పంపిణీ చేయబడింది. ఎలక్ట్రికల్ సంస్థలనుంచి కొన్ని దరఖాస్తులు వచ్చినప్పటికి రెండు కేంద్ర చట్టాలు అమల్లో వున్నందువల్ల కార్పొరేషను వాటిని మంజూరు చేయలేకపోయింది. ఆ రెండు చట్టాలు ఇవి. ఇండియన్ ఎలక్ట్రిసిటీ చట్టం, ఎలక్ట్రిసిటీ సప్లయి చట్టం. ఈ చట్టాలు రాష్ట్ర ప్రభుత్వానికి అధికారాలను దత్తం చేసినవి.

గత సంవత్సరం కార్పొరేషన్ యొక్క నికర ఆదాయం రూ. ౨,౮౫,౧౧౫-౦-౧౦. ఈ మొత్తంలో నుంచి డివిడెండ్లు చెల్లించడానికి రూ. ౧,౬౮,౧౧౫-౦-౧౦ లు వినియోగించవలెనని తలపెట్టబడింది. అసలు చెల్లించవలసిన డివిడెండ్ల మొత్తం రూ. ౩,౫౦,౦౦౦ లు. ఈ తరుగును సరిపుచ్చడానికై హైద్రాబాదు ప్రభుత్వాన్ని అర్థించవలసి వున్నది.

గత సంవత్సరం కార్పొరేషనుకు తక్కువగా దరఖాస్తులు రావడానికిగల కారణాలలో కుటీర, లఘు పరిశ్రమలకు ఆర్థిక సహాయం చేసే నిమిత్తం కేంద్ర ప్రభుత్వంచే తలపెట్టబడిన లఘు పరిశ్రమల బోర్డు స్థాపన జరుగడం ఒకటి. రక్షణ, వడ్డీ ప్రమాణం దృష్ట్యా ప్రభుత్వ పథకాల క్రింద ఇచ్చే అడ్వాన్సుల నిబంధనలు, షరతులు మిక్కిలి లాభదాయకంగా ఉంటాయి, కాబట్టి పై బోర్డు స్థాపనానంతరం కొన్ని పరిశ్రమలు అప్పుల కొరకు ఈ కార్పొరేషన్‌వద్దకు రావడంలేదు. మరొక కారణమేమంటే కేంద్ర ప్రభుత్వం వడ్లను చేతితో దంచే పద్ధతికి, పల్లెటూరి గానుగల ద్వారా నూనె తీసే పద్ధతికి విధాన రీత్యా హెచ్చు ప్రాముఖ్యమిస్తూ ప్రస్తుతం ఉన్నట్టి బియ్యం, నూనె మిల్లులను ఇంకా విస్తృత పరచడానికి విముఖంగా ఉన్నది. ఈ కారణాలే గాక రాష్ట్రమును భాషా ప్రాతిపదికపై విభజించవలెనన్న ప్రతిపాదన రీత్యా కూడా కార్పొరేషన్ వ్యాపారం కొంత మందగించింది.

# హైదరాబాదులో స్వాతంత్ర్యోద్యమం

## చారిత్రక సంఘటనల వివరణ - రెండవదశ (క్రీ. శ. 1885—1919)

క్రీ. శ. 1885 లో భారతజాతీయ కాంగ్రెసు మహాసభ అవతరించింది. అప్పటివరకల్లా మొదటి సాలార్జంగు అమలులోకితెచ్చిన పరిపాలనా సంస్కరణలు కొంత ఫలితాన్ని చేకూర్చ జొచ్చాయి. ప్రజలు విద్యావంతులైనారు. పాఠశాలలు, కళాశాలలు ఏర్పడినవి. భారతదేశంలోని వివిధ ప్రాంతాలనుంచి అనేకమంది వ్యక్తులు హైదరాబాదు రావడం మొదలయింది. ఈ కాలంలోనే ఉర్దూ ఆంగ్ల భాషలలో పత్రికారచన ఆరంభమయింది. క్రమంగా పత్రికలు ప్రజాభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ పరిపాలనపై తగు ప్రభావం వేయడం మొదలుపెట్టాయి. జాతీయ కాంగ్రెసు మహాసభ అవతరించగానే పాలకవర్గం ఆ సంస్థను వైరుధ్యభావంతో చూడడం మొదలుపెట్టింది. కాని దేశంలో ప్రముఖులైనవారు జాతీయ కాంగ్రెసు మహాసభను బలపరిచారు. అట్టివారిలో ముల్లాఅబ్దుల్ ఖయ్యూం, మొహిబ్ హుసేన్ ప్రత్యేకంగా చెప్పుకోదగినవారు. ముల్లా అబ్దుల్ ఖయ్యూం నిర్మాణాత్మక కృషికి పేరొందినవాడు. ఆయన కాంగ్రెసు సంస్థను బలపరిచాడు. నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య ప్రవేశపెట్టబడాలని కోరాడు. టర్కీ దేశంలో క్లిష్టపరిస్థితి ఏర్పడినప్పుడు ఆయన ఆ దేశానికి బాసటగానిల్చి దాని తరఫున వాదించాడు. హజాజ్ కన్‌స్ట్రక్షన్ రైలుమార్గ నిర్మాణానికి నిధులు ప్రోగుచేశాడు. స్వదేశీ ఉద్యమానికి ఆయన పెట్టనికోట. అఘోరనాథ చటోపాధ్యాయకు ఆయన పరమ మిత్రుడు. ఆయన క్రీ. శ. 1906 అక్టోబరు 21 తేదీన మరణించాడు. మరణ సమయం వరకూ ఆయన హైద్రాబాదు రాష్ట్రంలో చైతన్యం కలుగడానికి అమోఘమైన కృషి చేశాడు.

హైదరాబాదు రాష్ట్ర పత్రికారచన చరిత్రలో మొహిబ్ హుసేన్ ప్రముఖవ్యక్తి. 1879 లో ఆయన "మౌలాం షఫీక్" అను పత్రికను స్థాపించాడు. ఈ పత్రికలోనే ఆసియాఖండ ఉద్యమ నాయకుడు జమాలుద్దీన్ అఫ్గన్ హైద్రాబాదులో మకాంచేసిన కాలంలో కొన్నివ్యాసములు వ్రాసినాడు. ఈయన గొప్ప సాంఘిక సంస్కర్త. సమాజంలో అప్పుడు నెలకొనివున్న ఘోషాపద్ధతిని, ఇంకా ఇతర దొసగులను ఈయన ఖండించాడు. వాటిని రూపుమాపుటకై ప్రయత్నించాడు. స్త్రీలు విద్యాభ్యాసం చేయవలెనని ఈయన వాదించి, స్త్రీ విద్యా వ్యాప్తికొరకై "మౌలమీ నిస్వాన్" అనే పత్రికను కూడా నడపినాడు.

### ఆర్యసమాజం

ఆర్యసమాజం హైద్రాబాదులో మొట్టమొదట 1892 లో తన కార్యక్రమాలను ఆరంభించింది. కాని రెండేండ్లలోనే ఈ మతప్రచారకులిద్దరు రాష్ట్రంనుంచి బహిష్కరింపబడినారు. ప్రభుత్వంయొక్క ఈ చర్య ఆర్యసమాజమును ఇంకా ప్రోత్సహించింది. మత, సాంఘిక సంస్కరణల విషయంలో ఆర్యసమాజం కడు శ్రద్ధవహించింది. ఈ సమయంలో హైద్రాబాదు పరిపాలనా వ్యవస్థయొక్క ప్రతిష్ఠ అంత బాగా లేదు. అనేక కారణాలవల్ల భూమ్యాదాయశాఖ కార్యదర్శి వికారుల్ముల్క్, ఆర్థికశాఖ కార్యదర్శి మొహసనుల్ముల్క్ దేశీయ వ్యవహారాలశాఖ కార్యదర్శి మొహదీ హసన్, నిజాంయొక్క ఉపాధ్యాయుడు, శిక్షకుడు అయిన సర్వర్‌జంగ్ రాష్ట్రం విడిచిపోవలసివచ్చింది. మరికొంత మంది అధికారులు రైల్వే విస్తృతీకరణ, గనుల త్రవ్వకపు హక్కులు మొదలగువాటి ఆర్థిక వ్యవహారాలలో చిక్కుకున్నారు. ఆ కారణంచేత వారిని వారి ఉద్యోగములనుంచి తొలగించవలసివచ్చింది. 19 వ శతాబ్దపు చివరి దశాబ్దంలో పత్రికలు బాహాటంగా ప్రభుత్వాన్ని విమర్శించడం మొదలుపెట్టాయి. ఈ విమర్శలను గమనించి ప్రభుత్వంకూడా పత్రికలపైనను, వాటి సంపాదకులపైనను అనేక నిర్బంధాలు విధించింది. దీనితో సంఘర్షణ మొదలయింది. ప్రభుత్వం యొక్క ఈ పోకడ్ను పత్రికలు నిరసించాయి. కొన్ని పత్రికలు నిలిచిపోయ్యాయి. దీనినిబట్టి ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వం హెచ్చుగా గమనించ నారంభించినట్లు విదితమవుతుంది.

పందొమ్మిదవ శతాబ్దపు చివరన బీదు జిల్లాలో సాయుధ తిరుగుబాటు సంఘటన ఒకటి జరిగింది. బాబాసాహెబ్ ఉరఫ్‌రావుసాహెబ్ అను వ్యక్తి రాష్ట్రేతర ప్రాంతంనుంచి వచ్చి బీదు, ఔరంగాబాదుజిల్లాలలో కొందరు అనుచరులను ప్రోగు చేసుకొని, మోమినాబాదు ఔరంగాబాదులలో కంటింజెంట్ దళాలలో విద్రోహం పురికొల్పి వారిని కూడగట్టుకొని బీద్ జిల్లాలో అనేక దాడులు జరిపాడు. భారతదేశంలో బ్రిటిషు పరిపాలనను అంతమొందించడమే తన లక్ష్యమని అతడు ప్రకటించాడు. అతడి అనుచరులు 1899 ఏప్రిల్ 14 వ తేదీన బీద్ వద్ద కంటింజెంట్ దళాలతో ఘోరంగా పోరాటం సల్పి కొద్ది సేపట్లోనే చెల్లాచెదరై పొయ్యారు. ఈ సంఘర్షణలో బాబా తప్పించుకొని పారిపొయ్యాడు. కాని అతడి అనుచరులకు మాత్రం దీర్ఘకాలపు కారాగార శిక్షలు విధింపబడినవి.

1898 సంవత్సరారంభంలో పూనాలో జరిగిన రండ్ హత్య కేసుతో సంబంధమున్నదని చెప్పబడిన వారిలో ఒకడైన బాలకృష్ణ హరి చాపేకర్ రాయచూరు జిల్లాలోని కొప్పల్ తాలూకాలో దాగుకొని వుండగా అరెస్టు చేయబడినాడు. స్థానిక ప్రజల సానుభూతిని అతడు కొంతవరకు చూరగొన గలిగాడు.

హైద్రాబాదులో మొట్టమొదటిసారిగా 1896 లో గణేశ ఉత్సవాలు ప్రారంభమయ్యాయి. ఈ ఉత్సవాలు రాష్ట్ర ప్రజలలో ఎంతో చైతన్యాన్ని కలిగించాయి. ఈ చైతన్యం ముఖ్యంగా మరాట్వాడా జిల్లాలలో బాగా ప్రస్ఫుటమయింది. ఈ ఉత్సవాలలో అనేక మంది వ్యక్తులు వివిధ విషయాలపై ప్రసంగించి శ్రోతలకు విజ్ఞానమును కలుగజేసెడివారు.

## పండిత సత్వాలేకర్

1901 లో పండిత శ్రీపాద దామోదర్ సత్వాలేకర్ హైద్రాబాదు విచ్చేశారు. ఆయన ఏడేండ్ల పాటు నగరంలో నివసించాడు. ఆయన హైద్రాబాదులో ఉండగా పండిత కేశవరావు కోరట్కర్, డాక్టర్ అఘోరనాథ చటోపాధ్యాయ గారలతో సాన్నిహిత్యం పెంపొందించుకొని ఆర్యసమాజం, వ్యాయామం, విద్య, స్వదేశీ ఉద్యమం మొదలగు కార్యకలాపాలలో పాల్గొంటూ ఉండేవాడు. ఈ కాలంలోనే రాష్ట్రంలో ప్రైవేటు విద్యా సంస్థలు ప్రారంభింపబడినవి. వీటిలో నూతన విద్యాలయ ఉన్నత పాఠశాల ముఖ్యంగా చెప్పుకోదగినది ఇది గుల్బర్గాలో 1907 లో స్థాపించబడింది.

హైదరాబాదులో స్థాపించబడిన వివేకవర్ధినీ ఉన్నత పాఠశాల మరొక సంస్థ. పండిత సత్వాలేకర్ తదితర ప్రముఖులు స్థాపించిన సుల్తాన్‌బజారులోని వ్యాయామ మందిరం బెంగాలు వంటి దూరప్రాంతాలనుంచి కూడా అనేక మంది కార్యకర్తలను ఆకర్షించగలిగినది.

1908 లో హైద్రాబాదుకు చెందిన దత్తో అప్పాజీ తుల్జాపూర్కర్ ఏవో కొన్ని కార్యకలాపాలను జరుపుతున్నందుకుగాను రాష్ట్రంనుంచి బహిష్కరింపబడినాడు.

ఈ కాలంలోనే సావర్కర్ సోదరుల విప్లవ కార్యకలాపాలు నాసిక్‌నుంచి ఔరంగాబాదు వరకు వ్యాపించినవి. అనేకమంది యువకులు రహస్య సంస్థలలో చేరినారు. ఫలితంగా 1909 లో ఔరంగాబాదు పారిశ్రామిక పాఠశాల విద్యార్థి అనంత్ కన్హైరేచే నాసిక్ జిల్లా కలెక్టర్ మిస్టర్ జాక్సన్ హత్య చేయబడినాడు. ఈ హత్య హైద్రాబాదు పాలకవర్గాలలో గొప్ప ఆందోళన కలిగించింది. పర్యవసానంగా అనేకమంది వ్యక్తులు, ముఖ్యంగా విద్యాశాఖలోని ఉద్యోగులు ఉద్యోగంనుంచితొలగింపబడడమో లేక రాష్ట్రంనుంచి బహిష్కరింపబడడమో జరిగింది.

ఇదే సమయంలో గ్రంథాలయోద్యమం కూడా క్రమంగా వ్యాపింపజొచ్చింది. శాలిబండాలోని మరాఠీ పబ్లిక్ లైబ్రరీ రాష్ట్రంలోని మరాఠీ గ్రంథాలయములలో మొట్టమొదటిది. 1901 లో మునగాల రాజాగారు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారల ప్రోత్సాహంవల్ల హైద్రాబాదు నగరంలో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం స్థాపించబడింది. దీని తరువాత వరంగల్లు, నల్లగొండ, ఖమ్మం, మధిరలలో గ్రంథాలయములు నెలకొల్పబడినవి.

ఈ కాలంలో అంటే 1910 నుంచి 1920 మధ్యన ఇద్దరు ప్రముఖవ్యక్తులు హైదరాబాదు ప్రజాహిత జీవనంలోకి ప్రవేశించారు. వారి పేర్లు శ్రీ కేశవరావు కోరట్కర్, శ్రీ వామనరావు నాయక్. వీరుభయులు కాంగ్రెసు సంస్థను బలపరచి, రాష్ట్రంలోని విద్యా, సాంఘిక, మత వైజ్ఞానిక కార్యకలాపాలలో పాల్గొంటూ ఉండేవారు. వివేకవర్ధినీఉన్నతపాఠశాల, గుల్బర్గా నూతనవిద్యాలయ ఉన్నతపాఠశాల, మరాటీ పబ్లిక్ లైబ్రరీ, ఆర్యసమాజం మొదలగు సంస్థలు ఈ నాయకులిద్దరిలో ఎవరో ఒకరి ప్రాపకమును, పోషణను పొందుతూ ఉండేవి. శ్రీ కేశవరావు కోరట్కర్ గొప్ప సాంఘిక సంస్కర్త. మరణకాలం వరకూ ఆయన హైద్రాబాదు ఆర్యసమాజానికి నాయకుడుగా వున్నాడు. ఈయన రాష్ట్ర సంస్కరణల సంఘము, సాంఘిక సేవాసమాజములను వ్యవస్థీకరించి రాష్ట్రంలోని పలుప్రాంతాలలో సభలు సమావేశములు జరిపినారు. ఈ కాలలోనే రాష్ట్రంలో తెలుగు, మరాటీపత్రికలు వెలువడ నారంభించినవి.

## విద్యా మహాసభలు

విద్యారంగంలో చెప్పుకోదగిన విషయమేమిటంటే 1915 సంవత్సరం నుంచి ప్రముఖ విద్యావేత్తలు, అధికారులు, అనధికారులు విద్యా మహాసభలు జరుపుతూ వచ్చారు. ఈకాలంలో రాష్ట్రంలో ఉన్నతవిద్య కొరకు ఒక్కనిజాంకళాశాల మాత్రమే ఉండేది. అందుచేత ప్రభుత్వం వెంటనే ఉన్నత విద్యావ్యాప్తికి పూనుకుంది. తత్ఫలితంగా 1917 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది.

పరిపాలనారంగంలో చెప్పుకోవలసినదేమంటే వ్యక్తిగత పద్ధతిలో అంతవరకు నడుస్తున్న ప్రభుత్వమును సంస్థాగతముగా మార్చి ప్రభుత్వ కార్యనిర్వాహక మండలి నెలకొల్పబడింది. ప్రథమ ప్రపంచయుద్ధ ప్రభావం దేశంలోని ఇతరప్రాంతములపై పడినట్లే హైద్రాబాదుపై కూడా పడింది. ప్రజలలో రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది. ఆ రాజకీయప్రభావం రూపొందించినట్టి శక్తులవల్లనే తుదకు భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది.

ఈ విధంగా హైద్రాబాదులో 1885 నుంచి 1919 వరకు జరిగిన స్వాతంత్ర్యోద్యమం రెండవ దశ రాష్ట్రంలో అన్ని రంగాలలో ప్రజాచైతన్యం రూపొందడానికి ముఖ్యకారణమైంది. ఈ కాలంలోని ప్రధానవ్యక్తులు వీరు :

1. ముల్లా అబ్దుల్ ఖయ్యూం
2. డా. అఘోరనాథచటోపాధ్యాయ
3. మొహిబ్ హుసేన్
4. రామచంద్రపిళ్ళె
5. కేశవరావు కోరట్కర్
6. బ్యారిస్టర్ రుద్రా
7. వామన నాయక్
8. శ్రీపాద దామోదర్ సత్వాలేకర్
9. దర్తో అప్పాజీతుల్జాపూర్కర్
10. మాడపాటి హనుమంతరావు

ఈ కాలంలో జరిగిన సంఘటనల జాబితాను వాటి తేదీలతోసహా స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనా సంఘం తాలూకు హైద్రాబాదు రాష్ట్ర కమిటీ యొక్క పండితులు, పరిశోధకులు సిద్ధపరిచారు. ఆ జాబితా ఈ దిగువ ఉదహరింపబడుతున్నది :

## చారిత్రక సంఘటనలు - వాటి తేదీలు, రెండవ భాగం (1885—1919)

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| మార్చి | ౧౬ | ౧౮౮౫ | హైద్రాబాదు అధికారి మెహదీ అలీ (మొహసినుల్ముల్క్) భారత ముస్లిముల యొక్క విశ్వాసాన్ని దృఢపరుస్తూ 'బొంబాయి గెజట్' కు వ్రాసిన లేఖలో 'పాక్స్ బ్రిటాన్నికా' ను కొనియాడుట. |
| మే | ౪ | ౧౮౮౫ | మెహదీ అలీ లేఖను చదివిన తరువాత వైస్రాయికి కలిగిన ఆనందాన్ని ఆయన అంతరంగిక కార్యదర్శి తెలియబరుచుట. |
| | | ౧౮౮౫ | హైకోర్టు కొరకు రాజ్యాంగం (దస్తూరుల్ అమల్) సిద్ధం చేయబడుట. |
| | | ౧౮౮౫ | 'అక్బారె ఆసఫీ' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౫ | 'జోహరె సఖున్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౫ | 'హైద్రాబాదు రికార్డు' ఆరంభించబడుట. |
| డిసెంబరు | ౨౮ | ౧౮౮౫ | భారత జాతీయ కాంగ్రెసు జననం. |
| ఏప్రిల్ | 3 | ౧౮౮౬ | సికింద్రాబాదు - వరంగల్ రైలుమార్గం తెరువబడుట. |
| ఏప్రిల్ | | ౧౮౮౬ | రెసిడెంటుగా కర్నల్ ఇ. సి. రాస్ నియమించబడుట. |
| అగస్టు | ౮ | ౧౮౮౬ | సుల్తాన్ బజారులో 'యువజన అభివృద్ధి సంఘం' భవనానికి ప్రారంభోత్సవం జరుగుట. (ఈ సంఘం ౧౮౭౯ ఫిబ్రవరి ౨౬ తేదీన స్థాపించబడింది). |
| అగస్టు | | ౧౮౮౬ | పరిపాలనా భాషగా పారశీ స్థానే ఉర్దూ భాష ఉపయోగించబడుట. |
| అక్టోబరు | | ౧౮౮౬ | రెసిడెంటుగా శ్రీ జె. సి. కార్డెరే నియమించబడుట. |
| | | ౧౮౮౬ | హైద్రాబాదులో గనుల త్రవ్వకం హక్కులను హైద్రాబాదు దక్కన్ కంపెనీ సంపాదించుకొనుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| | | ౧౮౮౬ | గుల్బర్గాలో 'గుల్బర్గా సమాచార్' అను మరాటీ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౬ | 'దక్కన్ స్టాండర్డ్' అను ఆంగ్ల వారపత్రిక ఆరంభించబడుట. |
| ఏప్రిల్ | ౨౮ | ౧౮౮౭ | 'దక్కన్ పంచ్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| ఏప్రిల్ | ౧౯ | ౧౮౮౭ | ప్రధాన మంత్రి పదవికి రెండవ సాలార్‌జంగ్ రాజీనామా ఇచ్చుట. |
| జూలై | ౨౦ | ౧౮౮౭ | ప్రధాన మంత్రిగా సర్ అస్మాన్‌జా నియమించబడుట. |
| | | ౧౮౮౭ | రెసిడెంటుగా మేజర్ డి. రాబర్ట్‌సన్ నియమించబడుట. |
| | | ౧౮౮౭ | నిజాం కళాశాల స్థాపించబడుట. |
| | | ౧౮౮౭ | 'అఫ్సరుల్ అఖ్‌బార్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౭ | 'ఖియాలె మహబూబ్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౭ | 'గులే బుల్బుల్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౭ | 'భాగ్యనగర్' అను మరాఠీ పత్రిక ఆరంభించబడుట. |
| మార్చి | ౧౬ | ౧౮౮౮ | మొహిసునుల్ముల్క్ ఇంగ్లండులో ఒక ఇంటర్వ్యూ సందర్భాన జాతీయ కాంగ్రెసును తీవ్రంగా ఖండించి ముస్లిములు ఆ సంస్థకు దూరంగా ఉండవలసిందని హెచ్చరిక చేయుట. |
| సెప్టెంబరు | | ౧౮౮౮ | ప్రభుత్వ విధానం కాంగ్రెసు సంస్థకు వ్యతిరేకమనీ, దేశభక్తుల సంఘము (పేట్రియాటిక్ సొసైటీ) నకు అనుకూలమనీ తెలియజేస్తూ ప్రభుత్వం ముల్లా అబుల్ ఖయ్యూమ్‌కు హెచ్చరిక పంపుట. |
| అక్టోబరు | ౨౧ | ౧౮౮౮ | భారత జాతీయ కాంగ్రెసుయొక్క స్థానికసంఘం సమావేశం ఒకటి సికింద్రాబాదులో జరుగుట. |
| | | ౧౮౮౮ | భారత జాతీయ కాంగ్రెసును సమర్థిస్తూ ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ వ్యాసము వ్రాయుట. |
| | | ౧౮౮౮ | రెసిడెంటుగా శ్రీ ఎ. పి. హొవెల్ నియమించబడుట. |
| నవంబరు | ౧౨ | ౧౮౮౮ | హైద్రాబాదు క్లబ్బులో ప్రాతినిధ్య ప్రభుత్వ సూత్రాన్ని మొహిసినుల్ ముల్క్ వ్యతిరేకిస్తూ ముస్లిములు కాంగ్రెసునుంచి దూరంగా వుండవలసిందిగా కోరుట. |
| | | ౧౮౮౮ | కౌన్సిల్ ఆఫ్ స్టేట్ పని చేయకుండా నిలచిపోవుట. |
| | | ౧౮౮౮ | 'హసన్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౮౮ | 'సఫీరె దక్కన్' అను ఉర్దూ దినపత్రిక ఆరంభించబడుట. |
| ఆగస్టు | | ౧౮౮౯ | రెసిడెంటుగా సర్ డి. ఫిట్జ్‌పాట్రిక్ నియమించబడుట. |
| | | ౧౮౮౯ | హైద్రాబాదులో బ్యారిస్టర్ శ్రీ రుద్రా ప్రాక్టీసు పెట్టి అలహాబాదునుంచి వెలువడే 'పయొనీర్' అను పత్రికకు విలేఖరి అగుట. |
| | | ౧౮౮౯ | 'మహబూబుల్ కులూబ్' అను ఉర్దూ వారపత్రిక స్థాపించబడుట. |
| నవంబరు, డిసెంబరు | | ౧౮౮౯ | హైద్రాబాదు పరిపాలనమునుగూర్చి శ్రీ రుద్రా 'పయొనీర్' పత్రికలో జంకుగొంకులు లేకుండా విమర్శలు వ్రాయుట. |
| అక్టోబరు | ౧౨ | ౧౮౯౨ | శ్రీ బి. కృష్ణయ్యంగార్ అధ్యక్షతన జరిగిన చాదర్‌ఘాట్ హిందూ సోషల్ క్లబ్ సమావేశంలో ఉన్నత విద్యకై హిందూ విద్యార్థులను ఇంగ్లండు దేశం పంపే విషయమై ప్రభుత్వానికి విన్నపమును పంపుటకు నిశ్చయించబడుట. |
| అక్టోబరు | | ౧౮౯౦ | నిజాం క్లబ్ నుంచి శ్రీ రుద్ర బహిష్కరించబడుట. సాంఘికంగా కూడా ఆయన బహిష్కృతుడగుట. |
| నవంబరు | ౨౬ | ౧౮౯౦ | కలకత్తా నివాసి నవాబ్ అబ్దుల్ లతీఫ్‌ఖాన్ చాదర్ఘాట్ హిందూ సోషియల్‌క్లబ్బులో ప్రసంగిస్తూ హిందువులు, ముస్లిములు తమతమ హక్కులకొరకు చట్టబద్ధంగా పోరాడవలెనంటే వారి మధ్య ఐకమత్యం అవసరమని ప్రబోధించుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| | | ౧౮౯౦ | నిర్బంధ విద్యను సమర్థిస్తూ ముల్లా ఖయ్యూమ్ కరపత్రమును ప్రకటించుట. |
| | | ౧౮౯౦ | పారశీ, అరబ్బీ వ్రాత ప్రతులను ప్రచురించడం కొరకు 'దాయ రతుల్ మారిఫ్' అను సంస్థ నెలకొల్పబడుట. |
| | | ౧౮౯౦ | 'ఎక్బాల్ క్లబ్, హైద్రాబాదు' స్థాపించబడుట. |
| జనవరి | 3 | ౧౮౯౧ | చాదర్ఘాట్ మెథడిస్ట్ ఎపిస్కోపల్ చర్చికి చెందిన శ్రీ గిల్డర్ జాతీయ కాంగ్రెసు పట్ల సానుభూతి ప్రకటించుట. |
| ఫిబ్రవరి | | ౧౮౯౧ | హైకోర్టులో హిందూ న్యాయమూర్తిని నియమించవలసిందిగా ప్రభుత్వానికి విన్న వించే నిమిత్తం సికింద్రాబాదు ఆల్బర్ట్ రీడింగ్ రూమ్‌లో సమావేశం జరుగుట. |
| మార్చి | | ౧౮౯౧ | హైద్రాబాదులో న్యాయాన్నీ, న్యాయమూర్తులను విమర్శించినందుకుగాను, శ్రీ రుద్ర హైద్రాబాదు కోర్టులలో ప్రాక్టీసు చేయకూడదని నిషేధం విధింపబడుట. |
| జూన్ | | ౧౮౯౧ | ప్రభుత్వాధికారులకు చెరుపు కలిగించు నట్టి లేదా ప్రభుత్వంపైగాని ప్రభుత్వాధికారులపైగాని ప్రజలకు ప్రతికూల భావం కలిగించునట్టి వ్రాతలను ప్రచురించమని చెప్పి ఎగ్రిమెంటుబాండ్లు వ్రాసి ఇవ్వవలసిందిగా దేశీయ వ్యవహారాలశాఖ దేశీయ పత్రికలకు ఆజ్ఞాపత్రం పంపుట. |
| జూన్ | | ౧౮౯౧ | ఎగ్రిమెంటుబాండు వ్రాసి ఇవ్వ నిరాకరించినందుకుగాను 'క్హాతుల్ ఇస్లామ్' అను ఉర్దూ పత్రిక అణచివేయబడుట. |
| జూన్ | | ౧౮౯౧ | ప్రభుత్వాధికారులు 'సఫీరె దక్కన్' పత్రికను పీడించుట. |
| జూలై | ౩౧ | ౧౮౯౧ | 'దక్కన్ టైమ్స్' పత్రిక ఆగిపోవుట. |
| నవంబర్ | | ౧౮౯౧ | రెసిడెంట్ సర్ డెన్నిస్ ఫిట్జ్‌ప్యాట్రిక్ ఉద్యోగ విరమణ చేయుట. |
| | | ౧౮౯౧ | రెసిడెంటుగా సర్ టి. డబ్ల్యు. చిచెల్ ప్లౌడెన్ నియమింపబడుట. |
| | | ౧౮౯౧ | రాష్ట్రకేంద్ర గ్రంథాలయం స్థాపింపబడుట. |
| | | ౧౮౯౧ | 'దక్కన్ బడ్జెట్' అను ఆంగ్లవారపత్రిక ఆరంభించుట. |
| డిసెంబరు | | ౧౮౯౧ | 'దక్కన్ స్టాండర్డ్' పత్రిక నిలిచి పోవుట. |
| | | ౧౮౯౨ | సుల్తాన్‌బజారులో ఆర్యసమాజం స్థాపింపబడుట. |
| | | ౧౮౯౨ | 'మొల్లిమె నిస్వాఁ' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| డిసెంబరు | ౨౮ | ౧౮౯౨ | హైదరాబాదులో మూడవ ప్రదర్శనం ప్రారంభించ బడుట. |
| మార్చి | ౩౧ | ౧౮౯3 | చాదర్ఘాట్‌లో 'సన్మార్గ దర్శక్' అను క్లబ్బు తెరువబడుట. |
| | | ౧౮౯3 | రెజిస్లేటివ్ కౌన్సిల్ (శాసన సభ) నెలకొల్పబడుట. |
| | | ౧౮౯3 | 'ఖానూన్‌చామబాటిక్' ప్రకటన, మంత్రివర్గ స్థాపన, శాసనసభ స్థాపన. |
| | | ౧౮౯3 | ప్రధాన మంత్రి పదవికి సర్ అస్మాన్‌జా రాజీనామా ఇచ్చుట. |
| | | ౧౮౯3 | మంత్రివర్గ సంఘ స్థాపన. |
| మార్చి | ౨౪ | ౧౮౯౪ | హైద్రాబాదు నుంచి జావద్ హుస్సేన్ బహిష్కరింపబడుట. |
| మే | ౬ | ౧౮౯౪ | తొలిసారిగా హైద్రాబాదు శాసనసభ సమావేశం. |
| సెప్టెంబరు | ౫ | ౧౮౯౪ | వికారుల్ ఉమ్రా ప్రధానమంత్రిగా ఖాయపరచబడుట. |
| అక్టోబరు | ౧౭ | ౧౮౯౪ | హైద్రాబాదు నుంచి పండిత బాలకృష్ణ శర్మ బహిష్కరించబడుట. |
| | | ౧౮౯౪ | 'సహరె బయాన్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౫ | పార్లమెంటు సభ్యుడు డా. హర్ట్ హైద్రాబాదుకు వచ్చి హజ్ పరిస్థితిని అభివృద్ధి పరచడానికై నిర్బంధ చర్యలు గైకొనబడవలెనని చెప్పుట. ఈ విధంగా మత విషయాలలో జోక్యంకలిగించుకొనడమును ముల్లా అబ్దుల్‌ఖయ్యూమ్ ప్రతిఘటించుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| | | ౧౮౯౫ | భారత్ గుణవర్ధక్ సంస్థ అను పేరుతో మొదటి మరాటీ గ్రంథాలయం స్థాపించ బడుట. |
| | | ౧౮౯౫ | 'ముల్క్-వమిల్లత్' అను ఉర్దూ వార పత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౫ | 'ముంతఖబె రోజ్‌గార్' అను ఉర్దూ మాసపత్రిక స్థాపించ బడుట. |
| | | ౧౮౯౬ | 'నజారె ఆలమ్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౬ | 'అఫ్సర్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౬ | 'దిల్ గుజార్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౬ | 'దక్కన్ మెయిల్' పత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౬ | హైద్రాబాదు రాష్ట్రంలో ప్రథమ పర్యాయంగా గణేశ్ ఉత్సవాలు ఆరంభమగుట. |
| | | ౧౮౯౭ | క్రీట్ ద్వీపంలోని పీడిత ప్రజల కొరకై ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ నాయకత్వాన నిధి సేకరణ ఉద్యమం ఆరంభమగుట. |
| | | ౧౮౯౭ | శ్రీబాలకృష్ణ చెఫేకర్ గంగావతికి వచ్చుట. |
| | | ౧౮౯౭ | 'హైద్రాబాదు క్రానికల్' పత్రిక ఆరంభించ బడుట. |
| | | ౧౮౯౭ | 'నిజాం వైభవ్' అను మరాటీ పత్రిక స్థాపించబడుట. |
| | | ౧౮౯౭ | 'దబ్‌దబె ఆసఫీ' అను ఉర్దూ మాసపత్రిక స్థాపించబడుట. |
| | | ౧౮౯౭ | 'పష్ముల్ ఖలమ్' అను ఉర్దూ మాసపత్రిక స్థాపించబడుట. |
| | | ౧౮౯౭ | 'పయామె మహబూబ్' అను ఉర్దూ మాసపత్రిక ప్రారంభించబడుట. |
| | | ౧౮౯౭ | హైద్రాబాదు యంగ్‌మెన్స్ ఇండియన్ లైబ్రరీ స్థాపించబడుట. |
| | | ౧౮౯౮ | 'హజాజ్ రైల్వే' నిర్మాణం కొరకు ముల్లా అబ్దుల్‌ఖయ్యూమ్ నిధి సేకరణ ఆరంభించుట. |
| | | ౧౮౯౮ | హైద్రాబాదు రాష్ట్రంలో ప్లేగువ్యాధి సోకుట. |
| | | ౧౮౯౮ | బీడ్ జిల్లాలో బాబా ఉరఫ్ రావుసాహెబ్ కుట్ర. మోమినాబాద్, ఔరంగాబాదుల లోని కంటింజెంట్ దళాలలో విద్రోహం పురికొల్పబడుట. |
| డిసెంబరు | | ౧౮౯౮ | రాయచూరు జిల్లా మండలగిరిలో బాలకృష్ణహరి చాఫేకర్ అరెస్టు చేయబడుట. |
| | | ౧౮౯౮ | 'మెడికల్ జర్నల్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౯౮ | 'జల్వాయె మహబూబ్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౮౯౮ | 'మహబూబుల్ ఖలమ్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| ఏప్రిల్ | ౧౪ | ౧౮౯౯ | బీడ్‌లో బాబా అనుచరులకు కంటింజెంట్ దళాలకు పోరు జరుగుట. హైద్రాబాదు నుంచి బాబా తప్పించుకొని పారిపోవుట. |
| | | ౧౮౯౯ | 'సఫీరె దక్కన్' ఉర్దూ మాస పత్రిక ఆరంభించబడుట |
| | | ౧౮౯౯ | 'ముషీరె దక్కన్' అను ఉర్దు దినపత్రిక ఆరంభించబడుట. |
| మే | ౧౬ | ౧౯౦౦ | నాందేడు వరకు గోదావరి లోయ రైలు మార్గం తెరువబడుట. |
| | | ౧౯౦౦ | ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ పై విచారణ జరుపడానికి ఒక సంఘం నియమింప బడుట. |
| అక్టోబరు | ౧౯ | ౧౯౦౦ | మన్మాడు వరకు గోదావరి లోయ రైలు మార్గం పొడగించబడుట. |
| అక్టోబరు | ౨౪ | ౧౯౦౦ | ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ పింఛను పుచ్చుకొనుట. |
| | | ౧౯౦౦ | శాసన సభకు విస్తృతాధికారాలనిస్తూ శాసనసభ చట్టం ఆమోదించబడుట. |
| | | ౧౯౦౦ | న్యాయశాస్త్ర శిక్షణ తరగతులు ప్రారంభింపబడుట. |
| | | ౧౯౦౦ | రెసిడెంటుగా సర్ డేవిడ్ బార్ నియమించబడుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| | | ౧౯౦౦ | శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు హైద్రాబాదులో 'విజ్ఞానచంద్రికా గ్రంథమాలను' స్థాపించుట. |
| ఆగస్టు | ౨౮ | ౧౯౦౧ | వికారుల్ ఉమ్రా రాజీనామా పెట్టుట. ఆయన స్థానంలో తాత్కాలికంగా సర్ కిషన్ పర్షాద్ నియమించబడుట. |
| | | ౧౯౦౧ | హైద్రాబాదు సుల్తాన్ బజారులో మరాఠీ ప్రాథమిక పాఠశాల ఆరంభించబడుట. |
| | | ౧౯౦౧ | 'జామె జమ్షీద్' అను ఉర్దు వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౧ | 'అజీజుల్ అక్బార్' అను ఉర్దు వారపత్రిక ఆరంభించబడుట. |
| నవంబరు | ౧ | ౧౯౦౧ | హైద్రాబాదులో శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం స్థాపించబడుట. |
| | | ౧౯౦౨ | 'దఖనీ' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౨ | 'నసీమె దక్కన్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౨ | 'దక్కన్ టైమ్స్' అను ఆంగ్లపత్రిక ఆరంభించబడుట. |
| నవంబరు | ౫ | ౧౯౦౨ | బిరార్ ను బ్రిటిష్ ప్రభుత్వానికి దత్తంచేస్తూ సంధి జరుగుట. |
| | | ౧౯౦౩ | 'దక్కను పోస్ట్' అను ఆంగ్ల వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౩ | 'దక్కన్ రెవ్యూ' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౩ | 'ఫిసానా' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| జనవరి | ౨౧ | ౧౯౦౪ | వరంగల్‌లో రాజరాజనరేంద్ర గ్రంథాలయం స్థాపించబడుట. |
| | | ౧౯౦౪ | 'మియారుల్ ఇన్షా' అను ఉరుదూ మాసపత్రిక స్థాపించబడుట. |
| | | ౧౯౦౪ | 'బులెటిన్' అను ఆంగ్ల వారపత్రిక స్థాపించబడుట. |
| | | ౧౯౦౪ | 'ఇల్మ్-వ-అమల్' అను ఉర్దూ దినపత్రిక ఆరంభించబడుట. |
| నవంబరు | ౫ | ౧౯౦౪ | పబ్లిక్ గార్డెన్స్‌లో నాల్గవ ప్రదర్శనం ప్రారంభించబడుట. |
| ఫిబ్రవరి | ౧౪ | ౧౯౦౫ | హైద్రాబాదులో విక్టోరియా స్మారక అనాధ శరణాలయం తెరువబడుట. |
| జూలై | | ౧౯౦౫ | 'సహీఫా' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౫ | 'నిజాం విజయ్' అను మరాటీ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౫ | రెసిడెంట్‌గా సర్ చార్లెస్ బెలే నియమించబడుట. |
| | | ౧౯౦౫ | హైద్రాబాదులో స్వదేశీ ఉద్యమం ఆరంభమగుట. |
| | | ౧౯౦౫ | బెనారస్ కాంగ్రెస్ మహాసభకు ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ హాజరగుట. |
| | | ౧౯౦౫ | కాంగ్రెసులో ముస్లిముల ప్రవేశాన్ని సమర్థిస్తూ ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ ప్రతిపాదించుట. |
| | | ౧౯౦౫ | హెజాజ్ రైల్వే నిర్మాణం నిధిసేకరణకై ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ నాయకత్వాన ఉద్యమం మొదలగుట. |
| | | ౧౯౦౫ | 'నిజామి' అను ఉర్దూ వారపత్రిక ఆరంభమగుట. |
| | | ౧౯౦౫ | 'మహబూబ్ గజెట్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభమగుట. |
| | | ౧౯౦౫ | 'అల్లాదీ' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభమగుట. |
| జనవరి | ౮ | ౧౯౦౬ | దివ్యజ్ఞాన సమాజం భవనానికి అనిబిసెంట్ ప్రారంభోత్సవం జరుపుట. |
| జనవరి | ౧౮ | ౧౯౦౬ | హైద్రాబాదు పబ్లిక్ గార్డెన్సులో ఐదవ ప్రదర్శనం ప్రారంభించబడుట. |
| అక్టోబరు | ౨౮ | ౧౯౦౬ | ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ మరణం. |
| | | ౧౯౦౬ | 'అల్ మహబూబ్' అను ఉర్దూ వారపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౬ | 'దక్కన్ హెరాల్డ్' అను ఆంగ్ల వారపత్రిక ఆరంభించబడుట. |
| నవంబరు | | ౧౯౦౬ | 'సహీఫా' అను ఉర్దూ మాసపత్రిక దినపత్రికగా మార్చబడుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| జూన్ | | ౧౯౦౪ | గుల్బర్గాలో నూతన విద్యాలయం స్థాపించబడుట. |
| అక్టోబరు | ౨౫ | ౧౯౦౪ | వివేకవర్ధినీ పాఠశాల ఆరంభించబడుట. |
| | | ౧౯౦౪ | 'దక్కన్ గెజిట్' అను ఆంగ్లపత్రిక ఆరంభించబడుట. |
| ఫిబ్రవరి | ౧౪ | ౧౯౦౮ | 'క్రానికల్' సంపాదకుడు టెంపుల్‌టన్, బ్యారిస్టర్ న్యూటన్‌లు హైద్రాబాదునుంచి బహిష్కరించబడుట. |
| ఆగస్టు | ౪ | ౧౯౦౮ | దత్తో అప్పాజీ తుల్జాపూర్కర్ హైద్రాబాదు నుంచి బహిష్కరించబడుట. |
| సెప్టెంబరు | ౨౮ | ౧౯౦౮ | మూసీనది వరదలు వచ్చుట. |
| | | ౧౯౦౮ | రెసిడెంటుగా సర్ మైకేల్ ఓడ్వైర్ నియమించబడుట. |
| | | ౧౯౦౮ | ఇంగ్లండులో బ్యారిష్టర్ శ్రీ కిషన్ కార్యకలాపాలు. |
| | | ౧౯౦౮ | షిబ్లీ నౌమానీ కార్యదర్శిగా అంజుమన్ తరక్కీ ఉర్దూసంస్థ స్థాపించబడుట. |
| | | ౧౯౦౮ | 'అదీబ్' అను మాసపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౦౮ | ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి గ్రామంలో విరాట్‌రాయ ఆంధ్రభాషా నిలయం స్థాపించబడుట. |
| డిసెంబరు | ౨౧ | ౧౯౦౯ | ఔరంగాబాదు పారిశ్రామిక పాఠశాల విద్యార్థి అనంత్ లక్ష్మణ్ కన్ హరే నాసిక్ కలెక్టరు మిస్టర్ జాక్సన్‌ను హత్యచేయుట. |
| జనవరి | | ౧౯౧౦ | స్వదేశీ ఉద్యమం సందర్భంలో రాయచూర్ ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ కె. జి. కాలే ఉద్యోగం నుంచి తొలగించబడుట. |
| జనవరి | ౨౬ | ౧౯౧౦ | జాక్సన్ హత్య సందర్భంలో ఔరంగాబాదు పారిశ్రామిక పాఠశాలకు చెందిన హెడ్ డ్రాయింగు టీచరు వి. అనంతరావు యాదవ్ ఉద్యోగం నుంచి తొలగించబడుట. |
| | | ౧౯౧౦ | జాక్సన్ హత్య సందర్భంలో రెవెన్యూశాఖ గుమాస్తా బాలకృష్ణహరిఅంకూష్కర్ మరియు నారాయణహరి అంకూష్కర్ గారలు ఉద్యోగాల నుంచి తొలగించబడి రాష్ట్రం నుంచి బహిష్కరించబడుట. |
| | | ౧౯౧౦ | స్వదేశీ ఉద్యమం సందర్భంలో బీడ్ ఆసుపత్రి అసిస్టెంట్ మహాదేవ్ గోవింద్ కిట్‌డరె, విద్యాశాఖ ఉద్యోగి ఎల్. వి. కట్‌డరె గారలు ఉద్యోగాల నుంచి తొలగించబడి, రాష్ట్రం నుంచి బహిష్కరించబడుట. |
| | | ౧౯౧౦ | స్వదేశీ ఉద్యమ సందర్భంలో నిజామాబాదు పారిశ్రామిక పాఠశాల సూపరింటెండెంటు కాశీనాథ్ బల్వంత్ పాధ్య ఉద్యోగం నుంచి తొలగించబడుట. |
| | | ౧౯౧౦ | ఔరంగాబాదు సాంకేతిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శంకర్ గోవింద్‌సోహానీ ఉద్యోగం నుంచి తొలగించబడుట. |
| | | ౧౯౧౦ | జాక్సన్‌ను హత్య చేసినట్టి అనంతలక్ష్మణ్ కన్హైరే తాణా జైలులో ఉరితీయబడుట. |
| సెప్టెంబరు | ౨౮ | ౧౯౧౦ | 'దక్కన్ లా రిపోర్టు' అను ఉర్దూ పత్రిక ఆరంభించబడుట. |
| జూలై | ౧౬ | ౧౯౧౧ | మధిర తాలూకా యెర్రుపాలెంలో మహబూబియా ఆంధ్రభాషా నిలయం స్థాపించబడుట. |
| ఆగస్టు | ౨౯ | ౧౯౧౧ | నిజాం మహబూబ్ అలీఖాన్ మరణం. నిజాముగా మీర్ ఉస్మాన్ అలీఖాన్ సింహాసన మధిష్ఠించుట. |
| | | ౧౯౧౧ | రెసిడెంటుగా సర్ అలెగ్జాండర్ పిన్హె నియమించబడుట. |
| | | ౧౯౧౧ | బార్సీలైట్ రైల్వే నిర్మాణం పూర్తిఅగుట. |
| | | ౧౯౧౧ | 'గుల్‌దస్తె నాదిరా' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |

| నెల | | సంవత్సరము | సంఘటనలు |
|---|---|---|---|
| | | ౧౯౧౦ | 'సహీఫా' అను ఉర్దూ దినపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౧౧ | 'మారీఫ్' అను ఉర్దూ దినపత్రిక ఆరంభించబడుట. |
| | | ౧౯౧౨ | ప్రధాన మంత్రిగా మూడవ సర్ సాలార్‌జంగ్ నియమించబడుట. |
| | | ౧౯౧౨ | బాల్కన్ యుద్ధం. ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్ కుమారుడు ముల్లా అబ్దుల్ బాసిత్ కార్యదర్శిగా నిధుల సేకరణ కొరకై 'హిలాల్ అహమర్' స్థాపించబడుట. |
| | | ౧౯౧౨ | పూర్ణా-హింగోలీ రైలుమార్గం నిర్మాణం పూర్తిఅగుట. |
| నవంబరు | ౧౪ | ౧౯౧౨ | వినాయక్ గోవింద్ టిళే హైద్రాబాదు నుంచి బహిష్కరించబడుట. |
| | | ౧౯౧౨ | 'తాజ్' అను ఉర్దూ మాసపత్రిక ఆరంభించబడుట. |
| ఆగస్టు | 3 | ౧౯౧3 | సికింద్రాబాదులో సంస్కృత కళా సంవర్థనీ సంస్థ స్థాపించబడుట. |
| నవంబరు | ౧ | ౧౯౧3 | మధిర తాలూకా రేమిడిచర్ల గ్రామంలో సిద్ధమల్లేశ్వర గ్రంథాలయం స్థాపించబడుట. |
| ఆగస్టు | ౧౪ | ౧౯౧౪ | మొదటి ప్రపంచయుద్ధం ఆరంభమగుట. |
| | | ౧౯౧౪ | మూడవ సర్ సాలార్‌జంగ్ రాజీనామా ఇచ్చుట. |
| నవంబరు | ౧౮ | ౧౯౧౪ | పబ్లిక్ గార్డెన్సులో హైద్రాబాదు టౌన్‌హాలుకు ప్రారంభోత్సవం జరుగుట. |
| మార్చి | ౧ | ౧౯౧౫ | విద్యామహాసభ ప్రారంభింపబడుట. |
| | | ౧౯౧౫ | హైద్రాబాదు సోషియల్ రిఫార్మ్సు లీగు (సమాజిక్ సుధారణ సంఘ్) నెలకొల్పబడుట. |
| | | ౧౯౧౫ | అఘోరనాథ్ చటోపాధ్యాయ్ మరణం. |
| అక్టోబరు | ౧ | ౧౯౧౬ | మహబూబ్‌నగర్ వరకు మహబూబ్‌నగర్ రైల్వేలైను తెరువబడుట. |
| | | ౧౯౧౬ | రెసిడెంటుగా సర్ స్టూవర్ట్ ఫ్రేజర్ నియమించబడుట. |
| ఏప్రిల్ | ౨౬ | ౧౯౧౭ | ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపన. |
| డిసెంబర్ | ౧౦ | ౧౯౧౭ | హైద్రాబాదు పబ్లిక్ గార్డెన్సులో ఆరవ ప్రదర్శనం తెరువబడుట. |
| | | ౧౯౧౭ | నల్లగొండ జిల్లా సూర్యాపేటలో విజ్ఞాన ప్రకాశనీ గ్రంథాలయం స్థాపించబడుట. |
| డిసెంబరు | ౭, ౮ | ౧౯౧౭ | హైద్రాబాదు విద్యా మహాసభ మూడవ సాధారణ సమావేశం జరుగుట. |
| మార్చి | ౧౮ | ౧౯౧౮ | నల్లగొండలో ఆంధ్ర సరస్వతీ గ్రంథ నిలయం స్థాపించబడుట. |
| మే | ౨౨ | ౧౯౧౮ | వరంగల్‌లో శబ్దానుశాసన ఆంధ్రభాషా మందిరం నెలకొల్పబడుట. |
| అక్టోబరు | ౭ | ౧౯౧౮ | ఉస్మానియా విశ్వవిద్యాలయ చార్టర్ మంజూర్ చేయబడుట. |
| | | ౧౯౧౮ | నాందేడు జిల్లా కవనాలో సోషియల్ రిఫార్మ్ లీగు ( సమాజిక్ సుధారణ సంఘ్ ) యొక్క మొదటి మహాసభ జరుగుట. |
| | | ౧౯౧౮ | హైద్రాబాదు రాష్ట్రీ సంస్కరణల సంఘం నెలకొల్పబడుట. |
| | | ౧౯౧౮ | ఇన్‌ఫ్లూయింజా వ్యాధి సోకుట. |
| | | ౧౯౧౮ | హైద్రాబాదు సోషల్ సర్వీసు లీగు నెలకొల్పబడుట. |
| | | ౧౯౧౮ | ట్రాన్సులేషన్ బ్యూరో (అనువాదక సంస్థ) నెలకొల్పబడుట. |
| | | ౧౯౧౮ | శ్రీ వెంకట్రామారెడ్డి రెడ్డిహాస్టల్‌ను స్థాపించుట. |
| నవంబరు | ౧౧ | ౧౯౧౮ | మొదటి ప్రపంచయుద్ధం సమాప్తమగుట. |
| | | ౧౯౧౯ | నాందేడులో జిల్లా హద్‌గాంలో సోషియల్ రెఫార్మ్ లీగు యొక్క రెండవ మహాసభ జరుగుట. |
| | | ౧౯౧౯ | రెసిడెంటుగా మిస్టర్ సి. ఎల్. ఎస్. రస్సెల్ నియమించబడుట. |
| నవంబరు | ౨౧ | ౧౯౧౯ | ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ స్థాపించబడుట. |

# హైదరాబాదు డైరీ

★

మే 1956

1. ఆంధ్ర, బొంబాయి, మైసూరు, హైద్రాబాదు రాష్ట్ర ప్రభుత్వాల ప్రధాన కార్యదర్శులు హైద్రాబాదులో సమావేశమై హైద్రాబాదురాష్ట్ర విభజన దృష్ట్యా ప్రభుత్వ సర్వీసులు, రికార్డులు, ఆస్తులు అప్పుల సమాచార సేకరణ, రోడ్డు రవాణా మున్నగు విషయాలను చర్చించి అనేక నిర్ణయాలు గైకొన్నారు.

2. ప్రధానకార్యదర్శుల సమావేశంలో చేయబడిన నిర్ణయాల ననుసరించి ప్రస్తుతం ప్రభుత్వోద్యోగుల రిట్రెంచిమెంటు ఉండదని హైద్రాబాదు ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ పి. వి. ఆర్. రావు ప్రకటించారు.

3. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణకు సంబంధించిన వ్యవహారాలను చూడడానికై ముగ్గురు మంత్రులతో కూడిన మంత్రివర్గ ఉపసంఘం ఒకటి నియమించబడింది.

4. రాష్ట్రంలో చిన్నమొత్తముల పొదుపు ఉద్యమాన్ని తీవ్రతరం చేయడానికై స్మాల్ సేవింగ్సు స్కీము రాష్ట్ర సలహా సంఘం ప్రభుత్వానికి పంచ సూత్రములతో కూడిన సిఫారసులను చేసింది.

5. గద్వాల తాలూకా అయిజ గ్రామంలో నడుపబడుతున్న భారతసేవక్ సమాజ్ శిబిరవాసులు నిర్మించతలపెట్టిన ఒక మైలు పొడవు రోడ్డుకు రాష్ట్ర హోంశాఖమంత్రి శ్రీ డి. జి. బిందూ ప్రారంభోత్సవం జరిపారు.

6. హైద్రాబాదు జిల్లా క్రైమ్ బ్రాంచి పోలీసు సబ్ఇనస్పెక్టర్ శ్రీ ఒ. హెచ్. అమరేష్ హైద్రాబాదు శాసన సభ్యుల వసతిగృహాలలో ఒక ఇంటి గదిలోకి దొంగతనం చేయడానికి చొరబడినాడని చెప్పబడుతున్న ఒకవ్యక్తిని పట్టుకొనబోయి ఆ ఘర్షణలో గాయపడ్డాడు. ఆ వ్యక్తి గోవాకు చెందినవాడని తెలుస్తున్నది. శ్రీ అమరేష్ తాత్కాలికంగా ఆ గదిలో నివసిస్తున్నాడు.

7. తమవద్దగల పర్మిట్లలో పేర్కొనబడిన దానికంటే ఇక్కడ ఎక్కువకాలంవరకు నివసించినట్టి పాకిస్తాన్ జాతీయులపై పెట్టబడిన కేసులను, వారిపై కొనసాగింపబడుతున్న పరిశోధనలను విరమింపజేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

8. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భంలో నియమింపబడిన మంత్రివర్గ ఉపసంఘం సమావేశమై ప్రభుత్వోద్యోగుల విభజన, కేటాయింపు మున్నగు విషయాలపై ఆంధ్ర, హైద్రాబాదు, మైసూరు, బొంబాయి ప్రభుత్వాల ప్రధానకార్యదర్శులు చేసిన సూచనలను పరిశీలించింది.

9. హైద్రాబాదు కౌల్దారీ వ్యవసాయక భూముల చట్టంలో భూములు ముక్కచెక్కలు కాకుండా నిరోధించడము, కమతాల ఏకీకరణకు సంబంధించిన నిబంధనలను మెదకు, నిజామాబాదు జిల్లాలలోని 39 గ్రామాలలో అమలులోకి తేవడము జరిగింది.

10. కృష్ణానదీతీరాన నాగార్జునకొండ ప్రాంతంలో పురావస్తుశాఖ సాగిస్తున్న త్రవ్వకాల ఫలితంగా అక్కడ రాజోచిత స్నానఘట్టం ఒకటి బైటపడిందనీ, దానికి పొందికగల మెట్లవరుసలు, మెట్లవెంబడి పిట్టగోడల వరుసలు మొదలైన సౌకర్యాలు భారీ యెత్తున వున్నట్లు కనుగొనబడింది.

11. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంలో కర్ణాటక ప్రాంతానికి సంబంధించిన విషయాలను చూడడానికై అంతర్రాష్ట్ర మంత్రివర్గ సంఘంలో సభ్యుడుగా డాక్టర్ జి. యస్. మెల్కోటే నియామకాన్ని వ్యతిరేకిస్తూ హైద్రాబాదు రాష్ట్రంలో కర్ణాటక ప్రాంతానికిచెందిన 6 గురు శాసన సభ్యులు మైసూరు ముఖ్యమంత్రికి ఒకలేఖ వ్రాశారు.

12. తెలంగాణా ప్రాంతంలో ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెసు సంఘం ఉండడాన్ని పార్లమెంటు సభ్యుడు స్వామీ రామానందతీర్థ వ్యతిరేకించాడు.

13. కేన్సర్ ఆసుపత్రి నర్సుల వసతి గృహం, మరియు భారత సాంఘిక సేవామహాసభ మందిరం శంకుస్థాపన కేన్సర్ ఆసుపత్రి ఆవరణలో బేగం సోగ్రా హుమాయూన్ మిర్జాచే జరుపబడింది. ఈ ఉత్సవానికి రాష్ట్ర ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు అధ్యక్షతవహించారు.

14. భారతవైద్యుల మహాసభ అధ్యక్షుడు డాక్టర్ ఎ. సి. యుకిల్ హైద్రాబాదులోని భారతవైద్యుల మహాసభా భవనంలో మేజర్ నాయుడు స్మారక గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

15. హైద్రాబాదు స్టేట్ బ్యాంకును స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో విలీనం చేసే బిల్లు త్వరలోనే ప్రవేశపెట్టబడగలదని పార్లమెంటులో ప్రకటించబడింది.

16. సెంట్రల్ రైల్వేలో డోర్నకల్లు, కాజీపేట జంక్షనులలో 120 మంది ఫైర్మెన్‌లు సమ్మెచేయడం వల్ల పద్దెనిమిది రైలుబండ్లు రద్దుచేయబడినవి.

17. కాజీపేట స్టేషనునుంచి బయలుదేరుతున్న ఒక రైలుబండిని ఆప ప్రయత్నించిన సమ్మెదారులపై పోలీసులు బాష్పవాయువు ప్రయోగించారు.

18. హైద్రాబాదురాష్ట్ర ప్రజాసోషలిస్టు పార్టీ కార్యవర్గం ఆపార్టీ అధ్యక్షుడైన శ్రీరామమూర్తినాయుడును హైద్రాబాదు నగర ప్రజాసోషలిస్టుపార్టీ కార్యవర్గమునకు చెందిన ఏడుగురు సభ్యులను ఒకసంవత్సరకాలంవరకు పార్టీనుంచి తొలగించింది.

19. కాజీపేట, డోర్నకల్లు, బెల్లంపల్లి కేంద్రాలలో రైల్వే ఫైర్మెనులు చేస్తున్న సమ్మెకు సానుభూతి సూచకంగా పూర్ణాకేంద్రంలోని కొందరు ఫైర్మెనులు పనికి రాకుండా మానుకున్నారు.

20. హైద్రాబాదులో మూడురోజులపాటు జరిగిన అఖిలభారత ఉర్దూ మహాసభ సమాప్తమైంది. ఈమహాసభలో ఆమోదింపబడిన ఒక తీర్మానంలో ఉర్దూభాష బహుళంగా మాట్లాడబడే హైద్రాబాదువంటి రాష్ట్రాలలో ఉర్దూ బోధనా భాషగాగల కళాశాల ఉండవలెననీ, ఉర్దూ ఉపాధ్యాయులకు ట్రెయినింగు కళాశాల ఉండవలెననీ, అన్నివిశ్వవిద్యాలయములలోను ఉర్దూ విభాగములుండవలెననీ కోరబడింది.

21. కాజీపేటలో రైల్వేపనివారలు కల్పించిన సమ్మె పరిస్థితిని గూర్చి చర్చించడానికి పార్లమెంటులో ఇద్దరు కమ్యూనిస్టు సభ్యులు నోటీసు ఇచ్చిన వాయిదా తీర్మానాన్ని స్పీకర్ అనుమతించలేదు.

22. బొంబాయినగరమును సంయుక్త మహారాష్ట్రంలో చేర్చవలసిందిగా కోరుతూ సత్యాగ్రహం జరుపబడిన సందర్భంగా బీదరుజిల్లా భాల్కీలో 144వ సెక్షన్ అమలుపరచబడింది.

23. సెంట్రల్ రైల్వే సికింద్రాబాదు డివిజన్‌లో రైల్వే పనివారలు ప్రారంభించిన సమ్మె విరమించబడింది.

24. బుద్ధుని 2500 వ మహాపరి నిర్వాణ జయంతి రాజధానీనగరంలోను, జిల్లా కేంద్రాలలోను జరుపబడింది. ఆ సందర్భంలో బహిరంగ సభలు, ప్రత్యేక కార్యక్రమములు జరిగినవి. హైదరాబాదునగరంలో బౌద్ధకళాప్రదర్శనం తెరువబడింది.

25. హైద్రాబాదునగర మునిసిపల్ ఎన్నికలలో అభ్యర్థుల నిర్ణయం విషయమై వచ్చిన విభేదాలను పరిష్కరించడానికి హైద్రాబాదు విచ్చేసిన రాజ్యసభ సభ్యుడు శ్రీ హెచ్. సి. దాసప్ప తాము వచ్చిన కార్యం విజయవంతమైనదని తెలిపారు.

26. హైద్రాబాదు, సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులకు గల 94 స్థానాలకు 319 మంది నామినేషనులు వేయబడినవి.

27. ప్రాతిపదిక విద్య, సాంఘిక విద్యల కొరకు నియమింపబడిన ప్రత్యేక సంఘం హైద్రాబాదు సెక్రెటేరియెట్ బిల్డింగులోని కమిటీ హాలులో సమావేశమై సాంఘికవిద్య యావత్తును ఉపసంఘం సూచించిన పద్ధతులప్రకారం పునర్వ్యవస్థీకరించడానికి తగు చర్యలు గైకొనవలెనని సలహా ఇచ్చింది.

28. ఈ రాష్ట్రమునకు చెందిన మరాటీ, కన్నడ భాషలు మాతృభాషగాగల విద్యార్థులకు వచ్చే విద్యా సంవత్సరం ఆరంభంనుంచే విద్యాసౌకర్యములు

(తరువాయి ౬౦వ పుట చివర)

# స్థానిక ఫ్యాక్టరీలలో అవకతవకలు

# లేబర్ కమీషనర్ నివేదిక



రాష్ట్రంలో ఫ్యాక్టరీల నిర్వహణ స్థితిగతులలో అవకతవకలు వున్నట్లు నివేదించబడింది.

౧౯౫౬ మార్చి నెలలో మూడు సంస్థలు మంచి నీటి సౌకర్యాలను కల్పించలేదు. (లేబరు కమీషనర్ నివేదిక ఇట్లా తెలియజేసినది). ఆరు సంస్థలలో పాకీదొడ్లు, మూత్రశాలలు ఏర్పాటు చేయబడలేదు. నాలుగు సంస్థలు అపరిశుభ్రంగా వున్నాయి. ౩౩ సంస్థలలో శౌచ్య సౌకర్యాలు లేవు. ౫ సంస్థలలో కార్మికులకు వేతనంతో సహా సెలవులు ఇవ్వబడలేదు.

గత మాసంలో ౬ సమ్మెలు జరగడం, వాటిలో ౫౩౪౭ మంది కార్మికులు పాల్గొనడం, తత్ఫలితంగా ౧,౦౯౫ మనుష్యులు పనిచేసే రోజుల నష్టం జరగ్గా ఈ మాసంలో ౫ సమ్మెలు జరగడం, వాటిలో ౩౦౬ మంది కార్మికులు పాల్గొనడం, తత్ఫలితంగా ౬౬౩౯ మనుష్యులు పనిచేసే రోజుల నష్టం జరిగింది.

గత మాసంలో రాష్ట్రంలోని ౫ వస్త్ర మిల్లులలో పనిలోకి రాకుండా గైర్‌హాజరైన కార్మికులు ౧౭.౮ శాతం వుండగా మార్చి నెలలో ౧౭.౩ శాతం కార్మికులు గైర్‌హాజరైనారు.

ఈ మాసంలో ౩౪౦ ప్రమాదాలు సంభవించాయి. తత్ఫలితంగా ౭ గురు మరణించారు. ౫౪ మంది పరిస్థితి ప్రమాదకరంగా వున్నది.

౨ మరణాలకు, ౮ శాశ్వత మరియు ౩౮ తాత్కాలికంగా కార్మికులు వికలాంగులైన సంఘటనలకు రూ. ౧౦,౦౪౯-౧౨-౦ ల పరిహారం చెల్లించబడింది.

షాపులు, ఎస్టాబ్లిష్‌మెంట్ల చట్టం యొక్క నిబంధనలను ఉల్లంఘించి నందుకుగాను కార్మికులపై ఏడు కేసులు పెట్టబడినవి. వీటిలో ఆరు కేసులను కోర్టువారు పరిష్కరించి నేరస్థులకు జుల్మానా విధించారు.

---

* హైదరాబాదు డైరీ *

[౫౯ వ పుట తరువాయి]

కల్పించుటకై హైద్రాబాదు ప్రభుత్వము బొందాయి, మైసూరు ప్రభుత్వాలతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతున్నది.

29. హైద్రాబాదునగరం, సికిందాబాదు మునిసిపల్ ఎన్నికలకు దాఖలుచేయబడిన నామినేషనులను రిటర్నింగ్ ఆఫీసర్లు రెండు రోజులపాటు పరిశీలన జరిపి 12 మంది అభ్యర్థుల నామినేషన్ పత్రాలను నిరాకరించారు.

30. హెచ్. యస్. సి. పరీక్షలో మవర్నా ఆలియాకుచెందిన విద్యార్థి రాష్ట్రంలో ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు.

31. కేంద్రప్రభుత్వ ఆహార వ్యవసాయమంత్రి శ్రీ ఎ. పి. జెయిన్ వ్యవసాయ కర్మాగారం మరియు ప్రదర్శనంయొక్క సర్వసభ్య సమావేశంలో ప్రసంగిస్తూ రెండవ ప్రణాళిక గడువు అంతమయ్యే నాటికి మొత్తందేశంలో మేలురకంవిత్తనాలు ఉపయోగించబడగలవనీ, తద్వారా వ్యవసాయ రంగంలో ఉత్తమ ఫలితాలు సాధించబడగలవనీ తెలిపారు.

# వార్తలు - విశేషాలు

## ఆటవిక సలహా సంఘం

రాష్ట్ర ఆటవిక శాఖకు సలహాల నివ్వడానికీ, సహాయ పడటానికి గాను ఆటవికశాఖ మంత్రి అధ్యక్షతన ఒక సలహాసంఘం ఏర్పాటుచేయబడింది. ఈ సలహా సంఘంలో అధ్యక్షుడు గాక ఇతరత్రా ౫ గురు అధి కార సభ్యులూ, ౨౫గురు అనధికారసభ్యులు వున్నారు.

## చిన్న మొత్తముల పొదుపులు

చిన్న మొత్తముల పొదుపు పథకాన్ని తీవ్రంగా అమలుపరచడానికి మే ౩ వ తేదీన జరిగిన రాష్ట్ర సలహా సంఘంలో అయిదు సూత్రాలతో కూడుకున్న సిఫార్సులు చేయబడినవి. ఆ సిఫార్సులలో విద్యాశాఖ సాధ్యమైనంతవరకు నగదు బహుమతులకు మారుగా చిన్న మొత్తముల పొదుపు సర్టిఫికెట్లను ఇవ్వవలెననీ, ప్రభుత్వం సెక్యూరిటీలుగా చిన్న మొత్తముల పొదుపు సర్టిఫికెట్లను స్వీకరించవచ్చుననీ, పబ్లిక్ వర్క్సు శాఖ కంట్రాక్టర్ల నుంచి డిపాజిట్లుగా ఈ సర్టిఫికెట్లను స్వీక రించవచ్చుననీ, ధర్మాదాయ శాఖ మత సంస్థల నగదు ఆస్తులను చిన్న మొత్తముల పొదుపు సర్టిఫికెట్లకై పెట్టు బడి పెట్టవచ్చుననీ, ఈ పథకాన్ని జనసామాన్యంలో ప్రచారం చేయడానికై ప్రతి గ్రామంలోనూ స్థానిక కమిటీలు ఏర్పాటుచేయవలెననీ, పారిశ్రామిక కార్మికు లకు వేతనాలు కొంత నగదురూపంలోనూ, కొంత ఈ సర్టిఫికెట్లరూపంలోనూ ఇవ్వబడాలని చెప్పబడింది.

ఈ పథక వ్యాప్తికై విస్తృతంగా ప్రచార ఉద్య మాన్ని నిర్వహించడానికి కూడా నిర్ణయించబడింది.

## విశ్రాంతి గృహం

నర్సులకు, హెల్త్ విజిటర్లకు, మంత్రసానులకు వారు నిర్వర్తించెడి క్లిష్టమైన విధుల అనంతరం ప్రశాంతమైన పరిసరాలలో మనోల్లాసాన్ని కల్పించే నిమిత్తం హైద్రాబాదు నగరంలో సాలార్ జంగ్ ఎస్టేటుకు చెందిన మీర్ ఆలమ్ చెరువు అతిథి గృహంలో ఒక విశ్రాంతి గృహం ప్రతినెలా ౧౬ వ తేదీ నుంచి ౧౫ రోజులపాటు పైవారికి లభ్యంకాగలదు. ఈరోజు లలో విశ్రాంతి గృహం ఇతరుల ఉపయోగార్థం ఇవ్వబడదు.

## కేంద్ర చట్టాలు

౧౯౫౬ వ సంవత్సరపు ౨ వ నెంబరు ప్రజా ప్రాతినిధ్యపు సవరణ చట్టం, ఇదే సంవత్సరపు ౩ వ నెంబరు యూనివర్శిటీ గ్రాంటుల కమిటీచట్టం హైద్రా బాదుకు వర్తింపుచేయబడినవి. ౧౯౫౫ వ సంవత్సరపు పోటీ బహుమతుల చట్టం ౧౯౫౬ వ సంవత్సరం ఏప్రిల్ ౧ వ తేదీ నుంచి హైద్రాబాదులో అమల్లోకి తేబడింది. తత్ఫలితంగా ఆదేరోజు నుంచి ౧౯౫౪వ సంవత్సరపు హైద్రాబాదు బహుమతిపోటీల కంట్రోలు మరియు పన్నుచట్టం రద్దు అయింది.

## ౩ ఉద్యోగాలకు ౬౫౦ దరఖాస్తులు

స్థానిక పరిపాలనాశాఖ సర్వీసులో ౩ జూనియర్ సెక్రెటరీ ఉద్యోగాల కొరకు చేయబడిన ప్రకటనను పురస్కరించుకొని ౬౫౦కిపైగా దరఖాస్తులువచ్చాయి.

అందువలన అభ్యర్థుల నిర్ణయం కేవలం ఇంటర్వ్యూ ప్రాతిపదికపైననే గాక సాధారణ పరిజ్ఞానంలోనూ, ప్రాంతీయ భాషలలోను లిఖితపరీక్ష జరిపిన పిమ్మటనే అభ్యర్థులను ఎన్నుకొనడానికి పబ్లిక్ సర్వీసుకమీషన్‌ను కోరడమవుతుంది.

## స్థానిక లేఖలు

కేవలం స్థానికలేఖల బట్వాడాకొరకు నగరంలోని ముఖ్యమైన స్థావరాలలో ఆకుపచ్చరంగు ఉత్తరాల పెట్టెలు పెట్టబడినవి. అందువల్ల స్థానికంగా బట్వాడా కొరకు ఉద్దేశింపబడిన ఉత్తరాలను సాధారణంగా కన్పించే ఎఱ్ఱరంగు పెట్టెలలోగాక పైని చెప్పబడినట్టి పచ్చరంగు పెట్టెలలో వేయవలసిందిగా ఇందు మూలంగా ప్రజలను కోరడమవుతున్నది. ఇలా చెయ్యడం వల్ల సానిక లేఖల బట్వాడా త్వరితంగా జరగడానికి వీలుంటుంది.

## చేనేత మగ్గాల రిజిస్ట్రేషను

వాటాల రూపేణా, చెలామణీధనం రూపేణా ౪,౫౦౦ మంది నేతపనివాండ్రకు ఋణాలను ఇవ్వడం ద్వారా వారిని సహకార సంఘాల సభ్యులుగా చేసే ప్రభుత్వ పథకాన్ననుసరించి ౧౪ సంవత్సరాల వయస్సుకు పైగావుండి, పనిచేస్తున్న చేనేత మగ్గాలను కలిగివున్న వయోజన చేనేత పనివాండ్రంతాను తమ తమ మగ్గాలను వాణిజ్య, పరిశ్రమలశాఖ సూపరింటెం డెంటువద్ద రిజిస్టరు చేయించవలెను. ఇట్లా రిజిస్టరయ్యే మగ్గాలు పై అధికారి ఆధ్వర్యం క్రింద వుంచబడి, నడుపబడుతాయి. ఇట్లా రిజిస్టరు చేయించని పక్షంలో మగ్గాల యజమానులు ప్రభుత్వం విధించే శిక్షకు బాధ్యులగుదురు.

## మేలిరకం బియ్యపుజాతులు

హైద్రాబాదు ప్రభుత్వ వ్యవసాయశాఖ ఒక కొత్త రకం బియ్యపు జాతిని కనుగొన్నది. ఇది మేలురకం జాతికి చెందినది. ఐదు సంవత్సరాలక్రితం అంత ర్జాతీయ బియ్యపు మేలిజాతుల మిశ్రమ కార్యక్రమంలో పాల్గొన్న సందర్భంలో వ్యవసాయశాఖ హెచ్. ఆర్. ౧౯, హెచ్. ఆర్. ౨౨ అను హైద్రాబాదు బియ్యపు రకాలను ఎనిమిది రకముల జపాను జాతులతో కలిపి ఈ కొత్తరకాన్ని కనిపెట్టగలిగింది. ఈ కొత్తరకం రాజేంద్ర నగర్‌లోను ఇతర బియ్యపు పరిశోధనా కేంద్రాలలోను హెచ్చు ఎరువును ఉపయోగించి పరీ క్షించి చూడబడినది. రాజేంద్రనగర్ ప్రయోగ క్షేత్రంలోగల పైరులో అనేక జాతులు మిశ్రమమై ఉన్నవి. ఈ పైరులో ధాన్యం రాలిపోవడం ఉండదు. ఈ రకాన్ని ఇంకా కొన్ని ప్రయోగాలుచేసి ఫలితాలను వేచి చూడవలసి వున్నది.

## మొక్కజొన్న ప్రమాణం

ఈ రబీ పంటలో రాజేంద్రనగర్‌లోని ప్రభుత్వ ప్రయోగ క్షేత్రంలో టెక్సాస్ ౨౬ అనబడే మొక్క జొన్న విత్తనం వేయడంవల్ల ఎకరానికి ౬౦౦౦ పౌనుల ధాన్యం, ౧౦,౮౦౦ పౌనుల గడ్డి లభ్యమై ఒక కొత్త ప్రమాణం సాధింపబడింది. ఇక్కడ పండిన మొత్తం గింజలు, ఇటువంటి కొత్త మిశ్రమ పంటలను జనవ్యాపక ప్రాతిపదికపై ప్రవేశ పెట్టడానికి ప్రయోగచర్యగా వచ్చే ఖరీఫ్ పంటకు కరీంనగర్ ప్రాంతంలో విత్తనాలు పంచిపెట్టబడగలవు. రాజేంద్ర నగర్‌లో విజయవంతంగా నిర్వహించబడిన సాగుబడి పద్ధతులు ఎరువువేసే పద్ధతులు వ్యవసాయదార్లకు బోధింపబడుతాయి.

## సూత్న సామాజికాభివృద్ధి బ్లాకులు

హైద్రాబాదు రాష్ట్రంలోని ౮ జాతీయ వికాస కేంద్రాలు ౧౯౫౬ ఏప్రిల్ ౧వ తేదీనుంచి సామాజి కాభివృద్ధి బ్లాకులుగా మార్చబడినవి. ఆ కేంద్రాలు ఇవి: మెదక్ జిల్లాలోని సదాశివపేట, నల్లగొండజిల్లాలోని పెద్దఊర, ఉస్మానాబాదు జిల్లాలోని ఉమెర్గ, హైద్రా బాదుజిల్లాలోని పశ్చిమ హైద్రాబాదు, షాహాబాదు, మహబూబ్‌నగర్ జిల్లాలోని షాద్‌నగర్, పర్భనీ జిల్లాలోని హింగోలీ, గుల్బర్గా జిల్లాలోని యాద్గీర్.

## బందెలదొడ్డి సుంకం

హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో ప్రస్తుతం అమల్లోవున్న బందెలదొడ్డి సుంకం ప్రమాణం, బాగా పెరిగిన వ్యవసాయోత్పత్తుల ధరలకు అనుగుణంగా లేనందువల్ల ౧౩౪౫వ ఫసలీ నగర పోలీసు చట్టం సవరించబడింది. ఈ సవరింపు ననుసరించి హైద్రాబాదు పశువుల దురాక్రమణచట్టం క్రింద విధించబడే రేట్లతో సమానంగా ఈ రేట్లు పెంచబడినవి. బందెల దొడ్డి సుంకం హెచ్చింపబడక పూర్వం పశువుల యజమానులు తమ పశువులను ఆ విధంగా మేపడం లాభసాటిగా భావించెడివారు. అందువల్ల పొలాల యజమానులకు నష్టం కలిగేది. పైగా బందెలసుంకం కూడా ఎక్కువ వచ్చేదికాదు.

## ప్రైవేటు లిమిటెడ్ కంపెనీలు

౧౯౫౬ సంవత్సరపు భారత కంపెనీల చట్టపు ౧౨వ సెక్షనుక్రింద అన్ని లిమిటెడ్ కంపెనీల పేరులోని 'లిమిటెడ్' అన్న పదానికి ముందుగా 'ప్రైవేటు' అన్న పదాన్ని చేర్చడం, ఆ విధంగా చేర్చబడే పదాన్ని కంపెనీలకు చెందిన అన్ని బిల్లులలోనూ, లెటర్‌హెడ్స్‌లోనూ, చెక్కులలోనూ, ఇతర దస్తావేజులలోను ఉపయోగించడం అవసరమైనప్పటికీ ఈ చేర్పువల్ల కంపెనీయొక్క గుర్తింపుపైగాని హక్కులపైగాని లేక బాధ్యతలపైగాని ఎట్టి ప్రభావం పడదు.

౨౩వ సెక్షనులోని ౩వ సెక్షనులో పేర్కొన బడిన నిబంధనలు పై సందర్భాలకు వర్తింపజేయ బడుతాయి. కంపెనీపేరులో మార్పురావడంవల్ల ఆ కంపెనీ గైకొను న్యాయచర్యలకుగాని, లేక ఆ కంపెనీపై తేబడు న్యాయచర్యలకుగాని ఎటువంటి లోపమురాదు. భారత కంపెనీల చట్టంయొక్క ౨౪వ సెక్షను ననుసరించి 'లిమిటెడ్' అను పదమునకు ముందు 'ప్రైవేటు' అనే పదము చేర్చబడడం మినహా కంపెనీయొక్క నియమావళిలో ఎట్టిమార్పు లేకపోయినట్లయితే అన్ని విషయములలోను, చివరకు లైసెన్సుల మంజూరీ విషయంలోకూడా కంపెనీ తన పూర్వపు స్వభావాన్ని నిలబెట్టుకొని యథాప్రకారం పనిచేయవచ్చును.



# BOOKS OF LASTING VALUE

**9. 2500 YEARS OF BUDDHISM**

The publication of this book has been timed for the 2500th anniversary of Lord Buddha's Mahaparinirvana. Beginning with a foreword by India's Vice-President Dr. S. Radhakrishnan, the book discusses, among other things, the Life and teachings of the Buddha, origin and expansion of Buddhism its principal sects, schools, Buddhist Literature, Education and Art, Chinese travellers, Buddhistic studies and the cultural and political implications of Buddhism in the Modern World.

**Deluxe Rs. 6-0-0 Ordinary Rs.3-8-0**

**10. COMMUNITY DEVELOPMENT IN INDIA (1952–55)**

This publication is the first attempt of its kind to bring together under a single title the multifarious problems and activities of Community Development in India (Pp. 525).

**Rs. 7-8-0**

**11. SOCIAL WELFARE IN INDIA**

"The first effort at bringing out a standard reference book on Social Welfare will give a methodical foundation to our efforts in this direction." JAWAHARLAL NEHRU.

(Pp. XXI+850) **Rs. 8-8-0**

**12. HISTORY OF INDIAN JOURNALISM**

BY J. NATARAJAN

Part II of the Report of the Press Commission containing a broad but concise survey of the Development of the English and the Indian Languages Press in India during the first four decades (Pp 287). **Rs. 5-0-0**





షామంజిల్‌లో మరాట్వాడా రైతు ప్రతినిధులతో రాష్ట్ర ముఖ్యమంత్రి, మంత్రివర్గంలోని ఇతర సభ్యులు.
(క్రింద) రాయచూరులో తక్కువ ఆదాయపు వర్గములవారి కొరకు నిర్మింపబడిన ఇండ్లను
రాష్ట్ర ముఖ్యమంత్రి తనిఖీచేశారు.



